# దేవుడొక్కడే - నామములనేకం

(వివరణాత్మక వ్యాఖ్య)

ఆధార గ్రంథం :

మహర్షి దయానంద స్వామి విరచిత

జగత్ ప్రసిద్ధ **"సత్యార్థప్రకాశం"** - ప్రథమ సముల్లాసం








సంకలన వివరణలు :

**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)



మూలగ్రంథరచయిత

## మహర్షి దయానంద సరస్వతి

# దేవు డొక్కడే - నామము లనేకం

(వివరణాత్మక వ్యాఖ్య)




మూల గ్రంథం :

మహర్షి దయనంద స్వామి విరచిత జగత్ ప్రసిద్ధ

**"సత్యార్థప్రకాశం"** (ప్రథమ సముల్లాసం)

కర్త :

## సుమ్నార్థి

(డా. కోడూరి సుబ్బారావు)

ముద్రణ - వితరణ

**ఆర్యసమాజము - సీతాఫల్‌మండి**

మెయిన్ రోడ్డు, సీతాఫల్‌మండి,

సికింద్రాబాదు - 500 061. (తెలంగాణ)

ఫోన్ : 040 -27071816, 9133134156, 9246174018

వైదిక గ్రంథమాల : 8

# దేవు డొక్కడే - నామము లనేకం

ప్రథమ ముద్రణ : 1000 ప్రతులు

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 117

విక్రమాబ్దము : 2072

దయనందాబ్దము : 193

శ్రీ దుర్ముఖినామ సంవత్సరము

మాఘ మాసం, బ॥ దశమి 21-02-2017

**మూల్యము : మీరు పూర్తిగ చదవటం, మరొకరికి ఇచ్చి చదివించటం.**

ప్రతులకు :

**ఆర్యసమాజము - సీతాఫల్‌మండి,**

మెయిన్ రోడ్డు - సీతాఫల్‌మండి,

సికింద్రాబాదు - తెలంగాణ 500 061.

ఫోను :- 040-27071816, 9133134156, 9246174018.

Email : aryasamajsitafalmandi@gmail.com

**డి.టి.పి. & ప్రింటింగ్ :**

**విక్రాంత్ ప్రింట్ హౌస్,**

వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.

ఫోన్ : 9705085608.



# ప్రాక్కథనం (Foreword)

ప్రియమైన పాఠకులారా! సోదర సోదరీమణులారా!

<u>శుభం భూయాత్ - మీకు శుభమగును గాక!</u>

మహర్షి దయానంద సరస్వతిగారు హిందీభాషలో 'సత్యార్థ ప్రకాశం' అనే పేరుతో ఒక జగత్ప్రసిద్ధమైన గ్రంథాన్ని రచించారు. అది నిజంగా వేదశాస్త్రాలలోని సత్యమైన అర్థాలను ప్రకాశపరచే ఒక అద్భుతమైన గ్రంథం. మానవులై పుట్టినవారందరు తప్పక చదువవలసిన అతిముఖ్య గ్రంథం. అది మనలోని వివేకాన్ని నిద్రలేపి, బుద్ధిని వికసింపచేస్తుంది. తద్వారా మనకెంతో మేలు జరుగుతుంది. అయితే దానిని తెలుగులో అనువదించిన పండితులు గ్రాంథిక భాషలో వ్రాశారు. **యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః। స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥** (భ.గీ.3-21) అని చెప్పినట్లు శ్రేష్ఠులైన పండితులు, మేధావులు, ధర్మప్రబోధకులు దేనిని ఆచరించితే జన సామాన్యమంతా దానినే అనుసరిస్తారనే ఉన్నత ఆశయంతో మహర్షి సత్యార్థప్రకాశాన్ని అనువాదకులు ప్రాచీన గ్రాంథికభాషలో వ్రాయటం జరిగింది.

అనేక కారణాలవల్ల నేడు లోకంలో గ్రాంథికభాష కనుమరుగైపోతూ వ్యవహార భాష ప్రచలితమౌతున్నది. నేటి తరానికి గ్రాంథికభాష చాలా బరువగుతున్నది. అందుచే దానిని విద్యార్థినీ విద్యార్థులకు, ప్రారంభిక జిజ్ఞాసువులకు అర్థమయ్యేటట్టు వ్రాయమని చాలామంది మిత్రులు కోరుతున్నారు. అందుచే ఆ ప్రయత్నంగా అందలి ప్రథమ సముల్లాసాన్ని (అధ్యాయాన్ని) "దేవుడొక్కడే - నాములనేకం" అనే పేరుతో సంకలన రచనగా వ్రాశాను. పాఠకులు దీనిని చదివి మీ మీ అభిప్రాయాలను, సూచనలను వ్రాయగోరుచున్నాను. తదుపరి ముద్రణలో సవరించే ప్రయత్నం చేస్తాను.

మీ శ్రేయోభిలాషి

సుమ్నార్థి

(గ్రంథకర్త)



# ప్రకాశకీయము

మా సమాజం నుండి వెలువడుతున్న ఎనిమిదవ ప్రచురణ 'దేవుడొక్కడే - నామములనేకం' ను పాఠకులకు అందిస్తున్నందుకు సంతోషిస్తున్నాము. మీరు దీనిని చదివి చదివించి లాభాన్వితులయితే మా కృషి సఫలమయినట్లుగా భావిస్తాం.

చతుర్విధ పురుషార్థాలలో 'మోక్షం' ఉత్తమమైనది. సకల దుఃఖాలనుండి విడివడి పరమేశ్వరుని సాన్నిధ్యంచే కలుగు అత్యంత సుఖప్రాప్తి (పరమానంద ప్రాప్తి) మోక్షమనబడును. ఆ ఆనందం శాశ్వతం. వర్ణింపవీలుపడనిది. భౌతిక విషయాలవలన కలుగు ఆనందం అల్పం. క్షణికం. జీవుడు సుఖాభిలాషియగుటచే అతని జీవన లక్ష్యం-గమ్యం మోక్షంగా చెప్పబడుచున్నది.

ఈశ్వరునిచేరు సాధనాలలో ఒకటైన ధ్యానం (భగవన్నామస్మరణ లేక జపం) ముక్తిదాయకమని ఆత్మవిదులు తమ అనుభవంతో తెలియజేస్తున్నారు. ఈశ్వరుడు ఒక్కడేయనీ అతని ముఖ్య నామం 'ఓం' కారమనీ, ఈశ్వరుని గుణ కర్మ స్వభావాలు అనేకములగుటచే అతని నామములు కూడా అనేకమనీ వేదాలు ఉపదేశిస్తున్నాయి. పతంజలి మహర్షి ఈశ్వరుని నామమును 'అర్థభావన'తో జపించమంటాడు (తజ్జప స్తదర్థభావనం - యో.ద. 1-28). అనగా ఈశ్వర నామమును అర్థ సహితంగా గ్రహించి, దానికి సంబంధించిన గుణకర్మ స్వభావాలను నిరంతరం ఏకాగ్రచిత్తంతో ధ్యానిస్తూ, జీవితంలో వాటిని అనుకరించుటయే అర్థభావనం. కనుక దేవుని నామములకుగల విశిష్టతను తెలుసుకొననిదే జీవుడు ఈశ్వరుని నిజస్వరూపాన్ని తెలుసుకోలేడు. తన లక్ష్యమైన మోక్షం (పరమానందం)ను పొందలేడు. అందుకే స్వామి దయానంద సరస్వతి తన అమరగ్రంథం 'సత్యార్థప్రకాశం' మొదటి సముల్లాసంలో దాదాపు 108 నామములకు ధాత్వర్థంతో పాటు, గూఢార్థాన్ని వ్రాసి ఈశ్వర స్వరూపాన్ని తెలియజేసి మనకు మార్గదర్శనం చేశారు. వారికి మనమెంతో ఋణపడివున్నాం.

డా॥ కోడూరి సుబ్బారావు గారు ఆ సముల్లాసాన్ని సామాన్యులకు, విద్యార్థినీ విద్యార్థులకు అర్థమయ్యేటట్టుగా సరళమైన భాషలో వ్రాసి మన కందించారు. అంతేగాకుండా ఎంతో శ్రమపడి ఇంకా కొన్ని నామాలను వేదాలనుండి సేకరించి ఈ పుస్తకానికి అనుబంధంగా చేర్చారు. అనారోగ్యంతో వున్ననూ, వారు వైదిక సాహిత్యం ద్వారా సమాజానికి ఎంతో సేవ చేయుచున్నారు. వారి కృషి, సంకల్పం ప్రశంసింపదగినది. పరమేశ్వరుడు వారికి పూర్ణాయువును ప్రసాదించి, వారి కలం నుండి ఇంకా ఎన్నో రచనలు వెలువడాలని ప్రార్థిస్తున్నాము.

ఈ పుస్తక ప్రచురణకు మరియు నిఃశుల్క వితరణకు అంగీకరించిన అధ్యక్షులకు, అంతరంగ సభాకార్యవర్గమునకు ధన్యవాదములు. చక్కగా ముద్రించి సహకరించిన విక్రాంత్ ప్రింటు వారికి కూడా మా ధన్యవాదములు.

ఓం తత్సత్

భవదీయ
**డి. గంగాధర్**
మంత్రి
ఆర్యసమాజము - సీతాఫల్‌మండి



# దేవు డొక్కడే - నామము లనేకం

**ఓం శన్నో మిత్రః శం వరుణః, శన్నో భవత్వర్యమా।**
**శన్న ఇంద్రో బృహస్పతిః, శంనో విష్ణు రురుక్రమః ॥**

- యజుర్వేదం (36-9), ఋగ్వేదం (1-90-9)

ఓం నామక సర్వవ్యాపక సచ్చిదానంద సర్వేశ్వరా! నీవు ప్రాణులన్నిటికి మిత్రుడవు. వరించతగిన వారిలో నీవే శ్రేష్ఠతముడవు. అత్యంత న్యాయకారివి. సకలైశ్వర్య ప్రదాతవైన ఇంద్రుడవు. బ్రహ్మాండాధిపతివి. నీవు విష్ణువువు - సర్వవ్యాపకుడవు. ఉరుక్రముడవు - గొప్ప పరాక్రమశాలివి. మరెన్నో దివ్య గుణాలను కలిగిన నీవు మాకు 'శమ్ భవతు' - సుఖశాంతులను ప్రసాదింపుము.

**నమో బ్రహ్మణే, నమస్తే వాయో, త్వమేవ ప్రత్యక్షం**
**బ్రహ్మాసి, త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి,**
**ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి,**
**తన్మామవతు, తద్వక్తార మవతు, అవతుమా మవతు వక్తారమ్.**
**ఓ3మ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥**

- తైత్తరీయ అరణ్యకం (7-1)

అన్నిటికన్న గొప్పదియగు బ్రహ్మకు - పరమాత్మకు నా నమస్సులు, ఆయనిచ్చిన వేదములకును నా నమస్సులు. ఓ వాయువా! అత్యంత బలశాలివగు సర్వేశ్వరా! నీవు అంతర్యామి రూపమున ప్రత్యక్ష బ్రహ్మవు. నీవే ప్రత్యక్ష బ్రహ్మవని ప్రవచింతును గాక! నీవు అంతట వ్యాపించి ఉన్న దేవదేవుడవు. అందుచే ఋతం వదిష్యామి = వేదమునగల నీ ఆజ్ఞలను అందరికి ఉపదేశింతునుగాక! సత్యం వదిష్యామి = సత్యమునే పలుకుదునుగాక! సత్యమునే గ్రహింతునుగాక! సత్యమునే ఆచరింతునుగాక! తన్మామవతు = కనుక నీవు నన్ను రక్షించు. తద్వాక్తార మవతు = సత్యవక్తల నందరిని రక్షించుము.

ఓ పరమ రక్షకా! నన్ను రక్షించు.

మా ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖాలన్నీ నీ కృపవలన శాంతించునుగాక!

పై ఋగ్వేద మంత్రంలోని మిత్ర, వరుణ, వాయు, అర్యమ, ఇంద్రాది నామములన్నీ ఓం నామక సర్వసంరక్షకుని విశేషణాలే. ఈ విషయాన్ని మరింత స్పష్టంచేస్తూ వేదం ఏమి చెబుతున్నదంటే -

**ఇంద్రం మిత్రం వరుణమగ్నిమ్ + ఆహూ రథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్ ।**
**<u>ఏకం సద్ విప్రా బహుధా వదన్తి</u> + అగ్నిం యమం మాతరిశ్వాన మాహుః ॥**

- ఋగ్వేదం (1-164-49)

సృష్టి స్థితి లయకర్త ఒకే ఒక్కడు. అతనినే విప్రులు - జ్ఞానులు అనేక నామములతో పిలుస్తున్నారు. ఆ నామములన్నీ సృష్టికర్తలోని విశేష గుణకర్మ స్వభావాలను తెలిపేవే. వీటిలో ఓం అనేదే అతని ముఖ్యనామము - అసలు పేరు. కనుక ముందుగా మనం ఓం పదమును గురించి కొంత వివరంగా తెలుసుకుందాము.

'ఓం' అనే పదము 'అవ-రక్షణే' అనే సంస్కృత మూలధాతువుతో నిర్మించబడింది. అవ ధాతువులో రక్షణ, గతి, కాంతి, ప్రీతి మొదలైన 23 అర్థాలున్నాయి. వీటిలో మొదటిదైన 'రక్షణ' అనేదే ప్రధానమైనది. పరమేశ్వరుడు మనకు అసలైన సంరక్షకుడు. మనకు మన అమ్మకడుపులో ఈ శరీరాన్ని నిర్మించి యిచ్చినది, అప్పటి నుండి ఇప్పటి వరకు శరీరంలోని జీవన క్రియలన్నీ చేస్తున్నది అతడే కదా! శ్వాసను నడిపించేది, గుండెను స్పందింపచేసేది, మనం తిన్న ఆహారాన్ని రస రక్తాదులుగా మార్చేది, ఆ ఆహారసారాన్ని, ఆక్సిజన్‌ను ప్రతీకణానికి అందచేస్తున్నది అతడే కదా! కనుక ఆ సృష్టికర్తనే మనకు నిజమైన సంరక్షకుడు (Guardian). ఇదే దేవునకు మనకు ఉండే అసలైన సంబంధం. అందుచే జీవాత్మలమైన మనం సదా ఓం నామంతో దేవుని స్మరిస్తూ, ప్రార్థిస్తూ, ఉపాసిస్తూ అతనికి దగ్గరకావటం కోసం యత్నిస్తూ ఉండాలి. వేదం కూడా **"ఓ3మ్ క్రతోస్మర"** - యజుర్వేదం (40-15) = ఓ కర్మశీల మానవా! ఓ3మ్ నామముతో సృష్టికర్తనైన నన్ను స్మరించు" అంటుంది. **'ఓ3మ్ ఖం బ్రహ్మ'** (యజు.40-17)= అట్టి నేను 'ఖం' ఆకాశం వలె సృష్టిలో

అంతటా వ్యాపించి ఉన్నాను. 'బ్రహ్మ' అన్నిటికన్న పెద్దవాడను, గొప్పవాడను కూడా నేనే" నంటున్నాడు దేవుడు.

ఇంతేగాక, మన ప్రాచీన ఋషులు సమాధి స్థితులై అంతర్యామిగా ఉన్న ఓం నామక పరమాత్మను దర్శించి ఓం పదములోని మరికొన్ని అర్థాలను తెలుసుకొన్నారు. అవి ఏవంటే – "ఓం పదము 'అ' కార, 'ఉ' కార, 'మ' కారములతో ఏర్పడింది.

అ+ఉ+మ = ఓం అయ్యింది.

అ కారంలో – విరాట్, అగ్ని, విశ్వ మొదలైన నామము లున్నాయి.

ఉ కారంలో – హిరణ్యగర్భ, వాయు, తైజసాది నామములు,

మ కారంలో – ఈశ్వర, ఆదిత్య, ప్రాజ్ఞాది నామములు ఇమిడి ఉన్నాయి" అని బ్రాహ్మణ, ఆరణ్యకాది గ్రంథాలలో వ్రాసి పెట్టారు.

పరమాత్మ సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, సృష్టికర్త. అతని గుణకర్మలు, శక్తి సామర్థ్యాలు, స్వభావాలు అనంతంగా ఉంటాయి. వాటిలో ముఖ్యమైన వాటిని అకారాది క్రమంలోపెట్టి వాటి ముఖ్యమైన అర్థాలను సంక్షిప్తంగా తెలుసుకుందాము.

మనం చిన్నప్పటినుండి వింటూ వచ్చింది ఏమంటే – బ్రహ్మదేవుడు బ్రహ్మాండాలను, ప్రాణిసృష్టిని చేస్తూ ఉంటాడనీ, విష్ణుదేవుడు పాలిస్తూ ఉంటాడనీ, మహేశ్వరుడు 432 కోట్ల సంవత్సరాల కొకసారి ప్రలయంగా – అన్నిటిని విడివిడి పరమాణువులుగా మార్చివేస్తూ ఉంటాడని. కాని, పరమేశ్వరీయ జ్ఞానమైనవేదం, ఋషులు వ్రాసిన దర్శన ఉపనిషాదులు అన్నీ సృష్టి స్థితి ప్రలయాలను చేసే వాడు ఒకే ఒక్కడని నొక్కి వక్కాణిస్తున్నాయి. ఉదాహరణకు – **ఓం స నో బంధు ర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా** (ఋ. 10-121-10). అని వేదం,

**శ్లో॥ స బ్రహ్మా, స విష్ణుః, స రుద్ర స్స శివ స్సోక్షర స్స పరమః స్వరాట్। స ఇంద్ర స్స కాలాగ్ని స్స చంద్రమాః ॥** – కైవల్యోపనిషత్ (1-8)

ఆ సర్వవ్యాపక పరమాత్మయే బ్రహ్మ, అతడే విష్ణువు, అతడే రుద్రుడు,

అతడే శివుడు, అతడే అక్షరుడు, అతడే పరమాత్మ, విరాట్, ఇంద్ర కాలాగ్ని చంద్రులు". అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. (ఇట్లే మన తెలుగు పద్యాలు కూడా కొన్ని ఉన్నాయి. "ఎవ్వనిచే జనించు జగము, ఎవ్వని లోపల నుండు, లీనమై ఎవ్వనియందు డిందు, పరమేశ్వరు డెవ్వడు, మూలకారణం బెవ్వడు, అనాది మధ్య లయు డెవ్వడు, సర్వము దానయైన వాడెవ్వడు, వానిన్ ఆత్మభవున్ ఈశ్వరునే శరణంబు వేడెదన్".

కనుక, మతానికి ఒక దేవుడు, సంప్రదాయానికి ఒక దేవుడు వేరువేరుగా ఉండరు. అందరి శరీర నిర్మాణం, జీవనక్రియలు ఒకే రకంగా ఉన్నాయి కదా! మనమంతా ఒకే ఫ్యాక్టరీలో తయారైన శరీరాంగాలను కలిగి ఉన్నాము కదా!

పరమాత్మ నామములలో అగ్ని, వాయు, ఆదిత్య సూర్య చంద్రాది నామములు కూడా ఉన్నాయి. అట్లని ప్రాకృతిక పదార్థాలు దేవుళ్ళుకారు. ప్రకరణాన్ని సందర్భాన్ని బట్టి అట్టి నామములు భౌతిక పదార్థాలకు కూడా వర్తిస్తాయి. ఉదాహరణకు సంస్కృత భాషలో 'సైంధవము' అంటే గుఱ్ఱము, ఉప్పు అని రెండర్థాలున్నాయి. యజమాని భోజనం చేస్తూ సేవకున్ని సైంధవం తీసుకురా అంటే ఉప్పు తీసుకురావాలి. ఒకవేళ యజమాని మంచి దుస్తులు ధరించి పట్టణానికి పోయేటప్పుడు సేవకున్ని సైంధవం తీసుకురా అంటే గుఱ్ఱాన్ని తీసుకురావాలి. అంతేగాని భోజనం చేసేటప్పుడు గుఱ్ఱాన్ని, ప్రయాణ సమయంలో ఉప్పుని తీసుకువస్తే అతను మూర్ఖుడవుతాడు. అట్టివారిని యజమాని పనిలో నుండి తొలగించవలసి వస్తుంది. కనుక పదములకు ప్రకరణాన్ని (Context ను) బట్టి అర్థం చెప్పుకోవాలి.

పరమేశ్వరుని స్తుతి ప్రార్థన ఉపాసనలకు చెందిన మంత్రాలలో అగ్ని, వాయు, ఆదిత్య, సూర్య, చంద్రాది పదములకు దేవుని పరంగానే అర్థం చెప్పుకోవాలి. భౌతిక విజ్ఞానానికి చెందిన మంత్రాలలో అట్టి పదములకు ప్రాకృతిక పదార్థాల పరంగానే అర్థం చెప్పుకోవాలి. అందుచేత "ఆకాశాద్ వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ (తైత్తరీయోపనిషత్ బ్రహ్మానందవల్లి - 1) అనే వాక్యాలు వచ్చినచోట వాటికి భౌతిక పంచ భూతాల పరంగానే అర్థం చెప్పుకోవాలి. ఇవే పదములు పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసన మంత్రాలలో వచ్చినపుడు వాటికి పరమేశ్వరుని పరంగానే అర్థం చెప్పుకోవాలి.

పరమేశ్వరుని నామములన్నీ సార్థకములు, అంటే - అర్థవంతములు. లోకంలో కొందరి పేర్లు విచిత్రంగా ఉంటాయి. చాలా పేదవారు కూడా తమపిల్లలకు ధనరాజ్, దేవేంద్ర, దశరథ్ మొదలైన పేర్లు పెట్టుకుంటారు కురూపికి శ్యామసుందర్ అనీ, పిసినారికి దానారావు అనీ పేర్లుంటాయి. అట్టివాటిని నిరర్థక నామములనవచ్చు. కాని దేవుని నామములన్నీ సార్థకములే. అవి ఎలా సార్థకములో వరుసగా అకారాదిక్రమంలో (Alphabetic ఆర్డరులో) చెప్పుకుందాము. ఇది ఆధ్యాత్మిక ప్రకరణం కనుక ఇక్కడ ఆ పదములకు దేవుని పరంగానే అర్థం చెప్పుకుందాము.

సంస్కృతభాషలో వ్యాకరణ సూత్రాలతోబాటు ధాతుపాఠం ఒకటి ఉంటుంది. అంటే - పదములకు మూల ధాతువు లేమిటో ఆ ధాతువులో ఏ అర్థ ముంటుందో దానిలో సంక్షిప్తంగా చెప్పబడుతుంది. బంగారంతో రకరకాల పేర్లతో - ఉంగరం, ముక్కుపుడక, చెవిపోగులు, చంద్రహారం, వడ్డాణం మొ.నవి తయారు చేసుకున్నా అన్నిటిలో ఉండే మూలధాతువు బంగారమే కదా! గీటురాయితో దేనిని పరీక్షించినా అది బంగారమనే తెలుస్తుంది కదా! అట్లే మూలధాతువులో ఉండే అర్థమే ఆ ధాతువుతో ఏర్పడిన పదములలో భాసించాలి. కనుక ఈ క్రింది దేవుని నామములలో అది ఏ ధాతువుతో ఏర్పడిందో బ్రాకెట్స్‌లో ఇచ్చే ప్రయత్నం చేస్తున్నాము.

## <u>సర్వవ్యాపక సర్వేశ్వరుని అనేక నామములు</u>

**1)** <u>**అక్షరుడు**</u> - (క్షర-సంచలనే)-క్షరించటమంటే నశించటం. అక్షరుడంటే వ్యతిరేకార్థంగా నశించనివాడు అవుతుంది. దేవుడు నశించనివాడు. అక్షర పదము 'అశూజ్-వ్యాప్తౌ' అనే ధాతువుతోనూ నిర్మించవచ్చు. కనుక సర్వత్ర వ్యాపకుడని మరొక అర్థం.

**2)** <u>**అగ్ని**</u> - అగ్ని పదం వినగానే మనకు వంటశాలలోని అగ్ని గుర్తుకు వస్తుంది. కాని, 'అగ్ని' అనే పేరు పరమాత్మకు కూడా వర్తిస్తుంది. ఎట్లంటే -

ఈ పదం "అఞ్చు గతి పూజనయోః" అనే సంస్కృత మూల ధాతువుతో తయారౌతుంది. కనుక అగ్ని అంటే - 'గతి కలిగినది, పూజించ తగినది' అని అర్థం చేసుకోవాలి. ఇక్కడ గతి అంటే కేవలం కదలిక, వేగం కలదని అర్థంకాదు. గతికి

ఋషులు "గతిః+త్రయో అర్థాః జ్ఞానం, గమనం, ప్రాప్తిశ్చేతి" అని నిర్వచనం చెప్పారు. ఇంతేగాక - "పూజనం నామ సత్కారః, యోఽ ఇచ్ఛతి అచ్యతే ఽ గత్యం గత్యేతి వా సోయమగ్నిః" అనికూడా వివరించారు. అంటే - 1. జ్ఞాన పూర్వకమైన గమనంతో లక్ష్యంవైపు పయనించి, ప్రాప్తించవలసినదానిని ప్రాప్తించటాన్ని గతి అంటారని ఋషుల వివరణ.

2. అట్లే పూజనం అంటే గుళ్ళల్లో విగ్రహాలను పూజించినట్లు కాదు. ఎవరికి తగినట్లు వారిని సత్కరించటం. దేవుడు వేదం ద్వారా బోధించిన ఉపదేశాలను నిత్యజీవితంలో ఆచరించటం, ఆయన చెప్పిన విహిత కర్మలను చెయ్యటం, నిషిద్ధ కర్మలను వదిలి పెట్టటం దేవుని పూజ అవుతుంది. తల్లిదండ్రులను పూజించటమంటే వారి మాటలను శ్రద్ధగా విని ఆచరించటం. శ్రీరామునివలె తల్లిదండ్రుల వాగ్దానాలను పూర్తిచెయ్యటం.

సృష్టికర్త జ్ఞానం పరిపూర్ణం. అతని బలక్రియలు కూడా పరిపూర్ణాలే. కనుకనే ఉపనిషత్ ఋషులు "స్వాభావకీ యస్య జ్ఞాన బల క్రియా చ" అని కీర్తించారు. అందుచే ప్రార్థనా ప్రకరణంలో 'అగ్ని' నామము పరమాత్మకే వర్తిస్తుంది. మొదటిదైన ఋగ్వేదం 'అగ్ని' పదముతోనే ప్రారంభమౌతుంది. నాలుగు వేదాలలోను అగ్ని పదం 100కు పైగా పర్యాయాలు పరమేశ్వరుని పరంగా పేర్కొనబడింది. వైదిక వ్యాకరణం తెలియని కొంతమంది ఆచార్యులు అగ్నిపదాన్ని అగ్నిహోత్ర పరంగాను, సామాన్య అగ్ని పరంగాను వ్యాఖ్యానించారు. వాటినే విదేశీ వేదభాష్యకారులైన మాక్స్‌ముల్లర్, మొనియర్ విలియం, ప్రొ.విల్సన్ మొదలగు పండితులు అనుసరించి వేదాలకు ఆంగ్లంలో (ఇంగ్లీషులో) వ్యాఖ్యానించారు. మహర్షి దయానంద సరస్వతిగారి సంస్కృత భాష్యం చదివిన తరువాత కొందరు భాష్యకారులు తమ తప్పిదాన్ని తెలుసుకొని సవరించుకొన్నారు. కొందరు ఇంకా తమ మూర్ఖత్వాన్ని వదలలేదు. పరమాత్మ వారికి వివేక బుద్ధిని కలిగించును గాక! అగ్ని పదము ఆధిభౌతికార్థంలో రాజుకు, సేనాపతికి, దేశనాయకులకు వర్తిస్తుంది. ఆధిదైవికార్థంలో అగ్నిహోత్రానికి, సామాన్య అగ్నికి వర్తిస్తుంది.

**3)** <u>అజుడు</u> - (జని - ప్రాదుర్భావే) 'జ' అంటే జన్మించటమని అర్థం. ముందు అ

చేర్చటం వల్ల వ్యతిరేకార్థమై అజుడంటే జన్మించనివాడని అర్థం. "న జాయతే మ్రియతేవా కదాచిత్ (భ.గీ. 2-)" అని చెప్పినట్లు జీవాత్మలమైన మనం కూడా అజులమే. కాని, మనం శరీరాలలోనికి ప్రవేశిస్తూ, విడిచి పెడుతూ జనన మరణ దుఃఖాలకు గురి అవుతూ ఉంటాం. జడమైన మూల ప్రకృతిని కూడా అజ అనవచ్చు. అదికూడా క్రొత్తగా పుట్టదు. ఒకసారి ప్రపంచంగాను, మరొకసారి ప్రలయంగాను మారుతూ ఉంటుంది. కనుక ఆ యా ప్రకరణాలనుబట్టి అజ పదమునకు అర్థం చెప్పుకోవాలి. పరమేశ్వరుని పరంగా అజ పదమునకు "మూల ప్రకృతియైన పరమాణువులతో సృష్టిని చేయువాడు, జీవులను వారి వారి కర్మల ననుసరించి ఆ యా శరీరాలలో ప్రవేశపెడుతూ తానెప్పుడూ జన్మించనివాడని" అర్థం చెప్పుకోవాలి.

<u>ముఖ్య సూచన</u> : గ్రంథవిస్తరణ భీతిచే ఈ పదముల సంస్కృత నిర్వచనాలు వ్రాయుటకు వీలుపడుట లేదు. తెలుసుకోగోరువారు వాటిని మూలగ్రంథం – 'సత్యార్థ ప్రకాశం'లో చూసుకో గోరుచున్నాము.

**4) <u>అత్తా</u>** – ఈ నామము విచిత్రంగా ఉంది. కాని, తైత్తరీయోపనిషత్తులో (2–10లో) "అద్యతేఽత్తిచ భూతాని తస్మాదన్నం తదుచ్యతే" అనియు, వేదాంతదర్శనం (1–2–9)లో "అత్తా చరాచర గ్రహణాత్" అనియు వాక్యాలొస్తాయి. వీటికి దయానంద మహర్షి "అన్నిటిని తనలోపల ఉంచుకొన్నవాడు, అందరిచే గ్రహించుటకు యోగ్యుడు, చరాచర జగత్తును గ్రహించువాడును అగుటచే దేవునకు అన్నము, అన్నాదుడు, అత్త అను నామములు కలిగిన" వని వివరించారు. కనుక ఇచ్చట అత్తా అంటే అందరిచే కోరతగిన వాడని అర్థం. మేడిపండులో పురుగులు పుట్టి చస్తున్నట్లే పరమేశ్వరునిలో జగత్తుయొక్క ఉత్పత్తి స్థితి లయాలు జరుగుచున్నాయి" అని తమ సత్యార్థప్రకాశం (మూలగ్రంథంలో) వివరించారు.

**<u>5. అన్నము -</u>**
**<u>6. అన్నాదము -</u>** } ఈ రెండు నామముల అర్థం పై అర్థంలో ఉన్నాయి.

**7) <u>అద్వైతము (అద్వైతుడు)</u>** – బహుళ ప్రాచుర్యం పొందటంవల్ల అద్వైత పదము వినగానే ఆది శంకరాచార్యులవారు ప్రతి పాదించిన అద్వైత సంప్రదాయం గుర్తుకు

వస్తుంది. వారి అభిప్రాయం ప్రకారం బ్రహ్మపదార్థం తప్ప మరొకటి లేనే లేదనేది వారి వాదన. ఇది పూర్తిగా శాస్త్ర విరుద్ధం, యుక్తి విరుద్ధం. "మహాభారతకాలంనాడు అర్జునుడు అద్వితీయ ధనుర్ధారి" అంటారు. అప్పుడు అర్జునుడు తప్ప మరెవ్వరు విలుకాండ్రు లేరని కాదుకదా! కర్ణుడున్నాడు కదా! మరెందరో విలుకాండ్రు ఉన్నారు కదా!

అసలు అద్వైత పదమునకు అర్థమేమిటంటే రెండుగా గాని, రెంటితో కలిసిగాని ఉండటాన్ని ద్విత్వము అంటారు. దానికి ముందు 'అ' చేర్చటం వల్ల వ్యతిరేకార్థంగా రెండుగా లేనిదని అర్థం వస్తుంది. పరమేశ్వరుడు అద్వైతుడు అంటే - పరిమాణంలోగాని, శక్తిసామర్థ్యాలలోగాని పరమేశ్వరునితో సమానుడుకాని, అతనికన్న ఎక్కువవాడుగాని ఎవరూ లేరని అర్థం. అతనికన్న తక్కువ పరిమాణ శక్తి సామర్థ్యాలుగల జీవులు, జడమైన - జ్ఞానంలేని ప్రకృతి పరమాణువులు ఉన్నవని అభిప్రాయం.

**8)** <u>అనంతుడు</u> - (నాస్తి అంతో యస్య సః అనంతః) ఎవనికి అంతము - చివరభాగము లేదో వాడిని అనంతుడంటారు. అంటే - ఎవరికి పొడవు వెడల్పు మందము ఉండవో, మొదలు చివరలు ఉండవో అతడు అనంతుడు. దేవునిలో ఇవన్నీ ఉండవు కనుక దేవుడు అనంత పరిమాణము గలవాడు.

**శ్లో॥ దేశతః కాలతో వాపి గుణతో వాస్తుతోఽపి వా।**
**అవధిర్యస్య నాస్తేతి సోఽనన్తః పరికీర్తితః ॥**

- అని నిరుక్త టీకాలో మరొక నిర్వచనం.

**9)** <u>అనాది</u> - దేవుడు ఎప్పటినుండి ఉన్నాడు? ఎప్పటివరకు ఉంటాడు?దేవుని ఉనికికి కారణం ఎవరు? అనే ప్రశ్నలకు అంతుబట్టనివాడు కనుక అతడు అనాది.

**10)** <u>అంతర్యామి</u> - (యమ ఉపరమే) యామి అంటే నియమించే వాడని అర్థం. అంతర్యామి అంటే లోపలఉండి నియమించేవాడని అర్థం. దేవుడు అత్యంత సూక్ష్ముడు కనుక ప్రతీ అణువులోను వ్యాపించి అందలి పరమాణువులను నియమించి నడుపుతూ ఆ యా అణువుల ధర్మాలను కాపాడుతున్నాడు. లేకుంటే ఆక్సిజన్ నైట్రోజన్‌గా, నైట్రోజన్ ఆక్సిజన్‌గా మారిపోతూ ఉండేవి. అట్లే ప్రాణుల శరీరాలలో వ్యాపించి

వాటి జీవన క్రియలను నియమించి నడిపిస్తున్నాడు. కనుక అతడు సర్వాంతర్యామి - అన్నిటిని, అందరిని నియమించి నడిపించేవాడు.

11) <u>అర్యముడు</u> - (ఋ-గతి ప్రాపణయోః + యత్ + మాఙ్-మానే)సరియైన న్యాయం చేసేవారిని సన్మానించటం సుఖింపచేయటం, మానవులు మనోవాక్కాయాలతో చేసే కర్మలకు సున్నితపు త్రాసుతో తూచి యిచ్చునట్లు ఫలాలను ఇవ్వటం చేస్తున్నాడు కనుక దేవుడు అర్యముడు - అత్యంత న్యాయకారి.

12) <u>ఆకాశము</u> - (కాశృ దీప్తౌ) అన్ని వైపుల నుండి జగత్‌ను ప్రకాశపరుస్తూ ఉంటాడు కనుక దేవునకు ఆకాశమనే పేరు కలిగింది.

13) <u>ఆచార్యుడు</u> - (య ఆచారం గ్రాహయతి సర్వా విద్యా బోధయతి స ఆచార్యః ఈశ్వరః) సదాచారాన్ని నేర్పుతూ సకల విద్యలను బోధించే వారిని ఆచార్యులంటారు. సృష్టికర్త ప్రథమ మానవసృష్టి సమయంలో ఋషులకు సకల విద్యలను, సదాచారాన్ని వేదం ద్వారా ఉపదేశించాడు. కనుక ఆచార్యులకు కూడా ఆచార్యుడు దేవుడు.

14) <u>ఆత్మా</u> - (అత సాతత్యగమనే) సతత గమనం కలిగిన దానిని ఆత్మ అంటారు. జీవాత్మ ఒక శరీరాన్ని వదలి మరొక శరీరాన్ని ధరిస్తూ ఉంటుంది. కనుక జీవాత్మను కూడా ఆత్మ అనవచ్చు. పరమేశ్వరుడు సృష్టిలోని సమస్త జడపదార్థాలలోను, జీవులలోను కూడా నిరంతరం వ్యాపించి ఉంటాడు కనుక అతనిని కూడా ఆత్మ అంటాయి శాస్త్రాలు.

15) <u>పరమాత్మ</u> - పరమేశ్వరుడు అత్యంత సూక్ష్ముడు కనుక సూక్ష్మములైన మూల ప్రకృతిలోను, జీవులలోను, ఆకాశంలోను వ్యాపించి అంతర్యామిగా ఉంటాడు కనుక అతనిని పరమాత్మ అంటాయి శాస్త్రాలు.

16) <u>ఆదిత్యుడు</u> - (దో అవఖండనే) ఖండితము, నాశము అయ్యేదానిని దితి అంటారు. ఖండితము, నాశనము కానిదానిని అదితి అంటారు. దానికి తద్ధిత ప్రయోగంతో ఆదిత్య పదము నిర్మితమౌతుంది. కనుక ఆదిత్యుడంటే ఎప్పటికీ నశించనివాడని అర్థం. (యజు. 33-39 చూడండి).

17) <u>ఆనందుడు</u> - (దునది సమృద్ధౌ+అజ్) దేవుడు ఆనందస్వరూపుడు. ముక్త పురుషులను సదా ఆనందితులను చేయుట చేతను, ధర్మాత్ములకు జీవనానందాన్ని (ఆత్మతృప్తిని) కలిగించుట చేతను దేవునకు ఆనందుడని మరియొక పేరు.

18) <u>ఆప్తుడు</u> - (ఆప్ళ - వ్యాప్తౌ) సామాన్య భాషలో ఆప్తుడంటే మన మేలుకోరేవాడని అర్థం. ఆ రకంగా దేవుడు మనకు పరమ ఆప్తుడు. మానవుల మేలుకోరుతూ సృష్ట్యాదిలోనే సకల సత్యవిద్యాదాతయును, ధర్మాత్ములకు సులభంగా లభించువాడును, ధర్మాత్ములు పొందుటకు యోగ్యుడును అగుటచే దేవుడు ఆప్తుడు. (పరమ ఆప్తుడు).

19) <u>ఇంద్రుడు</u> - (ఇది - పరమైశ్వర్యే) విశ్వమంతా అతని ఐశ్వర్యమే కనుక దేవునకు ఇంద్రుడని మరొక పేరు.

20) <u>ఈశ్వరుడు</u> - (ఈశ - ఐశ్వర్యే) దేవుని ఐశ్వర్యం అనంతం. అందుచే దేవునకు ఈశ్వరుడని పేరు. జ్ఞానం కూడా ఐశ్వర్యమే. అట్టి జ్ఞానం కూడా అనంతంగా ఉండటంవల్ల దేవునకు ఈశ్వరుడని సార్థక నామధేయం.

21) <u>పరమేశ్వరుడు</u> - నియమంగా నడిపించు సామర్థ్యం గలవానికి ఈశ్వరుడని పేరు. ఈశ్వరులలో సమర్థవంతులలో అత్యంత సమర్థవంతుడగుట వలన దేవునకు పరమేశ్వరుడని మరియొక పేరు.

22) <u>ఉరుక్రముడు</u> - (ఉరు = గొప్ప; క్రమః= పరాక్రమము) గొప్పపరాక్రమవంతుడు అని అర్థం.

23) <u>ఓమ్</u> -(అవ-రక్షణే) దేవుడు మనకు గొప్ప సంరక్షకుడు(Guardian). వివరణ పూర్వపుటలలో ఉన్నది.

24) <u>కవి</u> - (కు - శబ్దే) వేదముల ద్వారా సర్వవిద్యలను ఉపదేశించిన మహా కవి. సర్వ విద్యానిధి. కనుక అతడు ఆది కవి.

25) <u>కాలము</u> - (కల - సంఖ్యానే) విశ్వమున గల సమస్త పదార్థాలను, జీవులను లెక్కించగలవాడు కనుక దేవునకు కాలము అని మరియొక పేరు.

26) <u>కాలాగ్ని</u> - దేవుడు ప్రలయ సమయంలో అగ్నిసమానుడై కాలమునకు కూడా

కాలమై 'కాలాగ్ని' ఔతాడు.

27) <u>కుబేరుడు</u> - (కుబి - ఆచ్ఛాదనే) తన వ్యాపక గుణంచే దేవుడు అన్నిటిని కప్పివేస్తాడు కనుక దేవునకు కుబేరుడని పేరు. లోకంలో ఎక్కువ ధనం కలవాడిని కుబేరుడంటారు. బహుశః డబ్బుతో అన్నిటిని కొనివేయ గలుగుతాడని ఆ పేరు వచ్చి ఉండవచ్చు.

28) <u>కూటస్థుడు</u> - (కూటే తిష్ఠతి ఇతి కూటస్థః) కూటము అంటే సమూహమని సామాన్యార్థం. జీవుడు దేహేంద్రియ మనోబుద్ధుల కూటములో (సమూహములో) ఉంటాడు కనుక జీవుణ్ణి కూటస్థుడని ఆధ్యాత్మిక శాస్త్రాలలో అక్కడక్కడ (భగవద్గీత 15-16 మొ॥ చోట) కనబడుతుంది. సృష్టిలోని సర్వపదార్థాలలో, వ్యవహారాలలో వ్యాప్తుడైయున్నప్పటికి పరమేశ్వరుడు తన స్వరూపమును విడువక వేరుగానే ఉంటాడు కనుక దేవుణ్ణి అక్కడక్కడ కూటస్థుడని పేర్కొనబడింది.

29) <u>కేతువు</u> - <u>ఏకేశ్వరునకు నవగ్రహాల పేర్లు కూడా ఉన్నాయి !!!</u>

దేవునకు గల అనేకానేక నామాలలో విచిత్రంగా పౌరాణికులు చెప్పే నవగ్రహాల పేర్లు కూడా ఉన్నాయి. అలాగని నవగ్రహాలు దేవుళ్ళుకారు. అసలు రాహుకేతువులు గ్రహాలే కాదు, నీడలు మాత్రమే. వాటి బదులు ఆధునిక ఖగోళ విజ్ఞానం చెప్పే యురేనస్, నెప్ట్యూన్‌లను గ్రహాలుగా చెప్పుకోవటం మంచిది. అయితే లోకంలో బహుళ ప్రాచుర్యం పొందిన నవగ్రహాల పేర్లు కూడా ఏకేశ్వరునికి వర్తిస్తాయి మూలార్థాన్ని (Root meaningను) బట్టి. అకారాది క్రమంలో ఇక్కడ కేతువు పేరు వచ్చింది. కనుక 'కేతువు' అనే పదములో మూలార్థం ఏముందో తెలుసుకొని, అది ఏకేశ్వరునకు ఎలా వర్తిస్తుందో ఇక్కడ తెలుసుకుందాము.

'కేతువు' పదము "కిత నివాసే, రోగాపనయనేచ" అనే సంస్కృత ధాతువుతో నిర్మించబడింది. కనుక నివసించుట, రోగాన్ని పోగొట్టుకోవటానికి చికిత్స చేసుకొనుట అనే రెండర్థాలు ఉన్నాయి. అందుచే పరమేశ్వర పరంగా ఋషుల చెప్పిన నిర్వచనం ఏమంటే - "సమస్త జగత్తునకు నివాసస్థానము, సర్వరోగరహితుడు, ముముక్షువులను ముక్తిసమయంలో జరామరణాది సమస్త రోగాలనుండి విడిపింప చేయువాడు కనుక

దేవునకు 'కేతువు' అనే పేరు వర్తిస్తుంది" అన్నారు.

**30) ఖమ్** - సంస్కృత భాషలో 'ఖమ్' అంటే ఆకాశమని అర్థం. ఆకాశంవలె దేవుడు కూడా వ్యాపించి ఉంటాడు కనుక వేదశాస్త్రాలలో అక్కడక్కడ దేవుణ్ణి 'ఖమ్' అనే పదముతో పేర్కొనటం జరిగింది. ఉదా : **"ఓ౩మ్ ఖమ్ బ్రహ్మ"** - యజుర్వేదం (40-17).

**31) గణపతి** - } ఈ రెండు పదములు "గణ - సంఖ్యానే" అనే ధాతువుతో
**32) గణేశుడు** - } నిర్మించబడతాయి. కనుక లెక్కించ తగిన వానికి పతి, ఈశుడు అనే అర్థాలు వస్తాయి. దేవుని పరంగా లెక్కించతగిన ప్రకృతిలోని వివిధ పదార్థాలకు, అనేక జీవులకు పతి-పాలకుడు, రక్షకుడు కనుక గణపతియనీ, వాటిని నియమించి నడిపించగలవాడు కనుక గణేశుడనీ అర్థం చెప్పుకోవాలి.

**33) గరుత్మాన్** - ఎవని ఆత్మ (స్వరూపము) చాలా పెద్దదో గొప్పదో అతడు గరుత్మాన్ - గరుత్మంతుడు. పరిమాణంలో, గొప్పదనంలో దేవుడే గొప్పవాడు కనుక ఈ విశేష నామము దేవునకు వచ్చినది.

**34) గురువు** - "గృ - శబ్దే" మానవులకు కావలసిన సమస్త విద్యలను, వేదముద్వారా సృష్ట్యాదిలోనే ఋషుల హృదయాలలో ప్రకాశింపచేసినవాడు కనుక గురువులకును గురువు ఆది గురువు పరమేశ్వరుడే. అందుచేతనే పతంజలి మహర్షి తమ యోగదర్శనం (1-29)లో **"స(ఏష) పూర్వేషామపిగురుః కాలే నానవచ్ఛేదాత్"** అని సూత్రీకరించారు.

ఇంతేగాక, ఇప్పటికినీ మనలో అంతర్యామిగా నుండి పరోపకారాది సత్కర్మలు చేసినపుడు ఆనందాన్నీ, ప్రోత్సాహాన్ని కలిగిస్తున్నాడు. చెడు కర్మలు చేయబోయే ముందు భయము, శంక, లజ్జ కలుగజేసి హెచ్చరిస్తున్నాడు. అర్థం చేసుకున్న బుద్ధిమంతులు వాటిని ఆపివేసి పాపంచేయకుండా రక్షింపబడుతున్నారు. నిర్లక్ష్యంచేసినవారు పాపులై కష్టాలపాలౌతున్నారు.

ఇంతేగాక, మనం యోగసాధనలు చేసి సమాధిస్థితిని పొందగలిగితే మనకి కావలసిన విద్యలను అంతర్యామి నుండి పొందవచ్చును. ఋషిత్వాన్ని పొందవచ్చును.

35) <u>చంద్రుడు</u> – (చది – ఆహ్లాదే) చంద్రుడంటే ఆహ్లాదం కలిగించేవాడని మూలార్థం. భౌతిక చంద్రుని వెన్నెల మనకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది కనుక ఆకాశంలోని ఆ ఉపగ్రహాన్ని చంద్రుడని పేర్కొంటారు. దీనికి పరమేశ్వరుని పరంగా –తాను ఆనంద స్వరూపుడై తన్నుపాసించువారందరికి ఆనందాన్ని, ఆహ్లాదాన్ని కలిగిస్తాడు కనుక దేవునకు చంద్రుడని పేరు.

36) **<u>చిత్</u>** – (చితి – సంజ్ఞానే) చిత్ అంటే చక్కగా తెలిసినవాడు, విచారశీలుడు, జ్ఞానవంతుడు అని అర్థం. దేవుడు అందరికన్న ఎక్కువ జ్ఞానవంతుడు – పూర్ణజ్ఞాని. అతని జ్ఞానం అనంతం. కనుక దేవుణ్ణి చిత్ స్వరూపుడని పేర్కొంటారు.

37) **<u>జలము</u>** – (జల – ఘాతనే) దుష్టులను దండించి దారిలో పెట్టువాడు కనుక దేవునకు జలమని పేరు. కనబడని పరమాణువులను వివిధ నిష్పత్తులలో కలిపి సృష్టిని చెయ్యటం, కాలాంతరంలో వాటిని విడదీసి ప్రలయం చేయటం మొ.నవి చేస్తూ ఉంటాడు కనకను కూడా దేవునకు జలమని పేరు వచ్చిందంటారు ఋషులు.

38) **<u>జ్ఞానము</u>** – చరా చర జగత్తునంతా తెలియువాడు కనుక దేవునకు జ్ఞాన మని పేరు. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని తైత్తరీయ ఉపనిషత్ (2–1). దేవుడు పరిపూర్ణ జ్ఞాని.

39) **<u>తైజసుడు</u>** – (తిజ – నిశానే) పరమేశ్వరుడు స్వయం ప్రకాశకుడు మరియు సూర్య నక్షత్రాదులకు ప్రకాశాన్నిస్తున్నాడు కనుక తైజసుడని చెప్పబడ్డాడు.

40) **<u>దయాళుడు</u>** – (దయ – దాన, గతి, రక్షణ, హింసా, దానేషు) దాన దయాది గుణాలు కలవాడు కనుక దేవునకు దయాళుడని పేరు. దీనిని మరికొంత వివరిస్తూ మహర్షులు "అభయదాత, సత్యాసత్యాలను సర్వవిద్యలను తెలియువాడు, సజ్జనులను రక్షిస్తూ దుష్టులను శిక్షించువాడు కనుక దేవునకు దయాళుడని పేరు వచ్చిం"దన్నారు.

41) **<u>దివ్యుడు</u>** – "ద్యుషు శుద్ధేశు పదార్థేషు భవో దివ్యః" అని మహర్షులు నిర్వచించారు. అంటే – ప్రకృతి మొదలైన దివ్య పదార్థాలలో వ్యాపించి ఉన్నవాడని అర్థం. దివ్య పదార్థాలన్నిటికీ దివ్యత్వాన్ని ప్రసాదిస్తున్నాడు కనుక దేవునకు దివ్యుడని మరి యొక పేరు.

**42)** <u>దేవ-దేవుడు</u> - "దివు-క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతి........ అనే 10అర్థాలు గల పెద్ద ధాతువుతో దేవ పదము నిర్మించడబడుతుంది. ఈ అర్థాలన్నీ దేవునకు వర్తిస్తాయి. ఎట్లంటే - అతడు

1.క్రీడా = పరుల సహాయం లేకుండా తానొక్కడే క్రీడగా ఈ సృష్టిని చేశాడు.

2. విజిగీషా = సదా అతడు జయశీలుడే - అతని నెవరూ జయించలేరు.

3. వ్యవహార = అతడు న్యాయాన్యాయవ్యవహార కుశలుడు.

4. ద్యుతి = స్వయం ప్రకాశకుడు.

5. స్తుతి = స్తుతించ తగినవాడు.

6. మోద= ఆనంద స్వరూపుడు.

7. మద = మదోన్మత్తుల మద మణిగిస్తాడు.

8. స్వప్న = ప్రాణులను (జీవులను) నిద్రపుచ్చి విశ్రాంతి నిస్తాడు.

9.కాంతి = కామించ తగినవాడు - అందరిచే కోరతగినవాడు.

10. గతి = గతి శీలుడు. తాను కదలకనే జగత్తునంతా గతివంతం చేస్తున్నాడు.

ఈ విధంగా దేవ పదములోని 10 అర్థాలు ఏకేశ్వరునికి వర్తిస్తాయి. అందుచేతనే మనం పలుమార్లు 'దేవుని దయ', "దేవుని దయ" అని వ్యవహరిస్తున్నాము.

ఇవేకాక సంస్కృత భాషలో 'దేవ' పదమునకు విస్తృతమైన అర్థాలున్నాయి. సంక్షిప్తంగా "యో దీవ్యతి క్రీడతి స దేవః = దేవుడు తన ఆనంద స్వరూపంలో స్వయంగా క్రీడిస్తూ, ఎవరి సహాయం లేకుండానే తానొక్కడే సృష్టి స్థితి ప్రలయాలు చేస్తున్నాడు కనుక దేవు"డని నిర్వచించారు.

**43)** <u>దేవీ</u> - దేవ పదములో ఉండే అర్థాలన్నీ దేవీపదములోనూ ఉన్నాయి. పరమేశ్వర నామములు మూడు లింగాలలోను ఉంటాయి. ఈశ్వరునకు విశేషణమైనప్పుడు దేవుడనీ, చితి, శక్తి పదములకు విశేషణమైనప్పుడు దేవీ అని అవుతుంది.

**44)** <u>ధర్మరాజు</u> - కేవలం ధర్మపూర్వక వ్యవహారమే చేస్తాడు కనుక దేవునకు ధర్మరాజు అని పేరు.

**45)** <u>నారాయణుడు</u> -

**శ్లో॥ ఆపో నారా ఇతిప్రోక్తా ఆపో వై నరసూనవః ।**
**తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః** -మను. 1.10.

నీళ్లకు, జీవులకు 'నారా' అని పేరు. అయనం అంటే నివాస స్థానం. కనుక సర్వజీవులందు వ్యాపకుడైన పరమేశ్వరునికి నారాయణుడని పేరు.

**46)** **<u>నిత్యుడు</u>** - త్రికాలలోను దేవుడు ఏకరసుడై ఉంటాడు. సర్వవ్యాపకుడు కనుక అతడు నిశ్చలుడు (చలనరహితుడు); ఎప్పటికీ నశించేవాడు కాదు కనుక దేవునకు 'నిత్యుడు' అనిపేరు.

**47)** **<u>నిరంజకుడు</u>** - అంజను డంటే మోహ యుక్తుడని అర్థం. దేవుడు మోహంలేనివాడు ఆకార రహితుడు, దుష్టాచారాలు, దుర్వ్యసనాలు లేనివాడు, విషయాసక్తుడు కానివాడు కనుక దేవునకు నిరంజనుడని పేరు.

**48)** **<u>నిరాకారుడు</u>** - దేవుడు సర్వవ్యాపకుడు కనుక అతనికి ఆకారం ఉండదు. ఆకారంలేని పరమేశ్వరునకు నిరాకారుడని పేరు. దుష్టసంహారం చెయ్యటానికి కూడా శరీరధారణ చేయవలసినపనిలేదు. అతని గుండెను ఆపివేస్తే చస్తాడు కదా!

**49)** **<u>నిర్గుణుడు</u>** - శబ్ద స్పర్శాది ప్రకృతి గుణాలు, కామ క్రోధాది జీవుల గుణాలు లేనందువలన దేవునకు నిర్గుణుడని పేరు.

**50)** **<u>న్యాయకారి</u>** - పక్షపాతరహితమైన ఆచరణకు న్యాయమనిపేరు. కేవలం న్యాయకరమైన స్వభావమే కలవాడగుటచేత దేవునకు న్యాయకారి అనిపేరు.

**51)** **<u>పిత</u>** - (పా-రక్షణే). పితా అంటే రక్షించి పోషించేవాడని అర్థం. దేవుడు సకల జీవులను పాలించి పోషిస్తాడు కనుక అతనికి 'పిత' అని "పరమపిత" అని పేర్లు.

**52)** **<u>పితామహుడు</u>** - తండ్రి తండ్రిని పితామహుడంటారు. మన తాత ముత్తాతలకును పిత కావున దేవునకు పితామహుడని పేరు.

**53) <u>పురుషుడు</u>** - దేహపురంలో ఉన్నవాడు కనుక జీవుణ్ణి పురుషుడంటారు. బ్రహ్మాండమనే పురంలో పూర్ణంగా ఉంటాడు కనుక దేవునకు కూడా పురుషుడనే పేరు వచ్చింది.

**54) <u>పృథివి</u>** - (పృథు-విస్తారే) విస్తరించి ఉండు దానిని పృథివి అంటారు. భూమి గుండ్రంగాఉన్నా మన కంటికి బల్లపరుపుగానే కనపడతుంది కనుక మనం భూమిని పృథివి అంటున్నాము. దేవుడు ప్రకృతిని జగత్తుగా విస్తరింప చేశాడు కనుక ఆయనకు పృథివి అని మరియొక పేరు.

**55) <u>ప్రజాపతి</u>** - జీవు లనే ప్రజలందరికి దేవుడు పతి-పాలకుడు. సకల ప్రాణులను పాలించి పోషించేవాడు కనుక దేవునకు ప్రజాపతి అనిపేరు.

**56) <u>ప్రపితామహుడు</u>** - లోకంలో తాత తండ్రిని ప్రపితామహుడని అంటారు. దేవుడు మన ముత్తాతలకును ముత్తాత కనుక ఆయనకు ప్రపితామహుడని పేరు.

**57) <u>ప్రాజ్ఞుడు</u>** - విశేషంగా తెలిసికోగలవాడు సర్వజగుత్తు వ్యవహారములను ఉన్నది ఉన్నట్టుగా తెలుసుకోగలడు కనుక దేవునికి 'ప్రాజ్ఞుడు' అని పేరు.

**58) <u>ప్రాణము</u>** - ప్రాణవాయువును సృజించి ప్రాణులన్నిటికి ప్రాణము నిచ్చుచున్నాడు కనుక దేవునకు 'ప్రాణము' అనిపేరు.

**59) <u>ప్రియుడు</u>** - సకల ధర్మాత్ములను, ముముక్షువులను మరియు శ్రేష్ఠులను ఆనందింప చేయువాడునూ, అందరిచే కోరబడువాడును కనుక దేవునకు 'ప్రియు'డనిపేరు.

**60) <u>బంధువు</u>** - (బంధ-బంధనే) బంధించి ఉన్నవాడిని 'బంధువు' అంటారు. మన చుట్టాలు మోహంతో మనను బంధించి ఉంటారు కనుక చుట్టాలకు బంధువులని పేరు. పరమేశ్వరుడు సకల జీవులను తన ప్రేమపాశంతో బంధించి ఉన్నాడు కనుక అతనికి బంధువు అనే పేరు వచ్చింది.

**61) <u>బుద్ధుడు</u>** - (బుధ-అవగమనే) అవగమనం అంటే చక్కగా తెలుసుకోవటం. లోకంలో ఎక్కువ తెలిసినవాడిని బుద్ధిమంతుడంటారు. దేవుడు సర్వజ్ఞుడు కనుకనూ, అందరి బుద్ధికి విషయమైన వేదాలను ప్రకాశ పరిచాడు కనుకను దేవునికి బుద్ధుడని

పేరు.

**62)** <u>**బుధుడు**</u> - (బుధ-అవగమనే) పై 61వ. నామములో తెలిసికొన్నట్లు అవగమనం అంటే యథార్థ జ్ఞానం. స్వయంగా జ్ఞాన స్వరూపుడు, ఎల్లరి జ్ఞానమునకు కారణమైన బుద్ధిని సృజించినవాడు కనుక దేవునకు బుధుడు అని పేరు.

**63)** <u>**బృహస్పతి**</u> - బృహస్పతి అంటే 'గొప్పపతి' అని అర్థం. పరమేశ్వరుడు బ్రహ్మాండములన్నిటికి పతి - పాలకుడు కనుక అతనికి 'బృహస్పతి' అని పేరు.

**64)** <u>**బ్రహ్మ**</u> -
**65)** <u>**బ్రహ్మో**</u> - } (బృహ-బృహి వృద్ధౌ) అనే ధాతువులతో బ్రహ్మ, బ్రహ్మో అనే పదములు తయారవుతాయి. కనుక బ్రహ్మ అంటే పెద్దది, గొప్పది అని అర్థం. దేవునికన్న గొప్ప వాడు, పెద్దవాడు ఎవరూ లేరు కనుక అతనికి బ్రహ్మ లేక బ్రహ్మో అని పేర్లు కలిగాయి.

**66)** <u>**భగవాన్**</u> - (భజ-సేవాయామ్) సమగ్ర ఐశ్వర్యవంతుడు, అందరిచే భజింపదగినవాడు, మరియు సేవింపదగినవాడు అగుటచే దేవునకు 'భగవాన్' అని పేరు. భగ పదమునకు విద్వాంసులు మరి రెండు నిర్వచనాలు చెప్పారు.

**శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః।**
**జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణ ॥**

సమగ్ర ఐశ్వర్యం (రాజ్యాధిపత్యం) పరాక్రమం, కీర్తి, వివిధ సంపదలు ఆత్మపరమాత్మల విషయక జ్ఞానం, వైరాగ్యం (భౌతిక సంపదలపై విరక్తి, భగవంతునిపై అనురక్తి) అనే ఆరింటికి "భగము" అనిపేరు.

**శ్లో॥ ఉత్పత్తించ వినాశం చ భూతానా మాగతమ్ గతమ్।**

**వేత్తి విద్యాం చావిద్యాం చ స వై భగవాన్ ఇతి స్మృతః ॥**

సృష్టి యొక్క ఉత్పత్తి వినాశాలను, ప్రాణుల (జీవుల) రాకపోకలను, విద్య అవిద్యలను చక్కగా తెలుసుకున్న సాధు మహాత్ములను భగవాన్ అంటారు.

భగవాన్ అంటే భగాన్ని (ఐశ్వర్యాన్ని) కలవాడని అర్థం. కనుక పై సంపదలలో

ఏ సంపదను కలిగి ఉన్నవారినైనా భగవాన్ అనవచ్చు. అట్లే ఆధ్యాత్మిక జ్ఞానం కలిగిన వారినీ, వైరాగ్య సంపన్నులనూ కూడా 'భగవాన్' అని సంబోధించవచ్చు. కాని, మానవులలోని భగవాన్ లందరికంటె చాలా చాలా భగములను - ఐశ్వర్యాలను కలిగినవాడు కనుక దేవుడే అసలైన భగవంతుడు.

67) <u>భూమి</u> - దేనిపై సర్వభూతములు - ప్రాణులు నిలిచి ఉన్నాయో దానిని భూమి అంటారు. మనం ఉన్న భూమి అటువంటిదేకదా? విశ్వంలో ఇట్టి భూములు మరెన్నో ఉండి ఉంటాయి. ఇవన్నీ దేవునిలోనే ఉన్నాయికదా! అందుచే అతను భూములన్నిటికి భూమి - ఆధారం.

68) <u>మంగళుడు</u> - ఇక్కడ మంగళుడంటే మంగళ గ్రహంకాదు. (మగి - గత్యర్థః) పూర్వ పుటలలో తెలుసుకున్నట్లు గతికి - జ్ఞానం, గమనం, ప్రాప్తి అనే మూడర్థాలుంటాయి. ఇంతేగాక, శుభము, క్షేమము అనే అర్థాలుకూడా ఉన్నాయి. పరమేశ్వరుడు అందరి క్షేమాన్ని కోరేవాడు, వారికి శుభాలను, సుఖాలను ప్రసాదించేవాడు, మంగళ స్వరూపుడు కనుక దేవునికి మంగళు డని మరియొక పేరు.

69) <u>మనువు</u> - (మన-జ్ఞానే) దేవుడు జ్ఞానస్వరూపుడు, మాననీయుడు కనుక అతనికి మను వని పేరు కలిగింది.

70) <u>మహాదేవుడు</u> - జడ, చేతన దేవతలన్నిటికి దేవుడు కనుక అతనికి మహాదేవు డనే పేరు కూడా ఉంది.

71) <u>మాతరిశ్వుడు</u> - మాతరి అంటే అంతరిక్షమని అర్థం. ఆ అంతరిక్షంలో సంచరిస్తూ ఉంటుంది కనుక వాయువునకు మాతరిశ్వుడు అనే పేరు కలిగింది. ఆ వాయువులో ప్రాణులన్నిటికి అత్యవసరమైనది ప్రాణవాయువు (oxygen). అట్టి ప్రాణవాయువును సృజించినవాడు, వాయువుకన్న బలవంతుడు కనుక దేవునికూడా అక్కడక్కడ మాతరిశ్వ డని పేర్కొనటం జరిగింది.

పూర్వం ఉదహరించిన ఋగ్వేద (1-164-46) మంత్రంలోని చివరిపదం "...యమం మాతరిశ్వానమాహుః" లోని మాతరిశ్వపదం అక్కడ సృష్టికర్తకే వర్తిస్తుంది.

**72) <u>మాత</u>** - పూర్ణదయకలిగిన తల్లి తన సంతానం యొక్క సుఖాన్ని, ఉన్నతిని కోరుతుంది. అట్లే, పరమేశ్వరుడు సర్వజీవుల ఉన్నతిని కోరుతూ ఉంటాడు కనుక అతనికి మాత అనే పేరు కూడా కలిగింది. **"త్వం హి నః పితా వసో త్వం మాతా....** (ఋ. 8-98-17)-సర్వ జీవులను నీయందు వసింపచేసుకొనుచున్న ఓ వసో! నీవే మాకు నిజమైన పితవు. మాతవు కూడా నీవే. తల్లిగర్భంలో మాకు శరీరాలను నిర్మించి యిచ్చుచున్నది నీవే కదా!" అని ప్రార్థన చేసుకోమంటుంది వేదం. "నీవే తల్లివి తండ్రివి నీవే గురుడవు దైవం......." అని ప్రార్థించారు మన తెలుగు కవులు.

**73) <u>మిత్రుడు</u>** - (ఞిమిదా - స్నేహనే) అందరిని ప్రేమించేవాడు, అందరిచే ప్రేమింపయోగ్యుడు, స్నేహశీలుడు కనుక దేవునకు మిత్రు డనే పేరు కలిగింది.

**74) <u>ముక్తుడు</u>** - (ముచ్ఌ-మోచనే) అవిద్యాది క్లేశాలనుండి, త్రివిధ దుఃఖాల నుండి సదా ముక్తుడు కనుక దేవుడు నిజమైన ముక్తుడు. అట్లే ముముక్షువులను కూడా అవిద్యాది క్లేశాలనుండి, త్రివిధ దుఃఖాలనుండి విడిపించి తన తృతీయ ధామంలో విహరింప చేస్తాడు కనుక అతడు ముక్త స్వభావుడు. అందుచేతనే దేవుని నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావా! అని కీర్తిస్తాము.

**75) <u>యజ్ఞము</u>** - (యజ-దేవపూజా సంగతికరణ దానేషు) యజ్ఞపదంలో 3 అర్థాలున్నాయన్నారు పాణిని మహర్షి

**అ) <u>దేవపూజ</u>** - జడమైన పంచభూతాలను, దైవీ శక్తులను అగ్నిహోత్రంద్వారా పూజించాలి. మాతా పిత ఆచార్యాది చేతన దేవతలను తగిన విధంగా సత్కరిస్తూ, సేవిస్తూ ఉండాలి. అట్టి దానినే దేవపూజ అంటారు. గుళ్ళల్లో చేసే షోడశోపచార పూజ దేవపూజ కాదు.

**ఆ) <u>సంగతికరణం</u>** - అంటే కలపటం. మానవులను సంఘటిత పరచి ఒక ఉద్యమం నడపటాన్ని కూడా యజ్ఞం అనవచ్చు. కొన్ని మూలకాలను, పదార్థాలను కలిపి ప్రయోజనకరమైన ఒక క్రొత్త యంత్రాన్ని గాని, మందులనుగాని నిర్మించటం కూడా యజ్ఞమే.

**ఇ) <u>దానం</u>** - తన కష్టార్జితాన్ని పరోపకారం కొరకు ఖర్చుపెట్టడం. తను మనో

ధనాలతో పరోపకారం చేయటం కూడా యజ్ఞమే. భూదాన యజ్ఞం, విద్యాదాన యజ్ఞం మొ.

పై విధమైన యజ్ఞాలు మనం చెయ్యవలసినవి. దేవుడు చేసేది సృష్టి కార్యరూప మహాయజ్ఞం. వివిధ నిష్పత్తులలో సత్త్వ రజ తమము లనబడే పరమాణువులను జ్ఞాన పూర్వకంగా కలుపుతూ, జీవులమైన మనకొరకు ఈ అద్భుతాద్భుతమైన సృష్టిని చేస్తున్నాడు, దేవుడు. అతడు దేవతలందరిచేత పూజింప తగిన యోగ్యుడైన మహాదేవుడు. నిరంతర దానశీలి. కనుక అతడు యజ్ఞ స్వరూపుడు. కనుకనే "యజ్ఞో వై విష్ణుః" (శతపథబ్రాహ్మణం 23-1-8-8) అని ఋషులు కీర్తించారు. విష్ణువే యజ్ఞము - సర్వవ్యాపకుడే నిజమైన యజ్ఞమన్నారు. సృష్టిలోని అనేకానేక పదార్థాలను పేర్కొంటూ అవన్నీ 'యజ్ఞేన కల్పంతామ్' = యజ్ఞస్వరూపుడైన పరమాత్మచే సృజింపబడ్డాయంటుంది యజుర్వేద 18వ అధ్యాయం చమకం.

**76)** <u>**యముడు**</u> - యముని పేరు వినగానే అందరికి భయం. యముడు మృత్యుదేవతయనీ, భయంకర ఆకారంతో, దున్నపోతుపై స్వారీచేస్తూ మృత్యుపాశంతో ప్రాణుల ప్రాణాలు లాగివేస్తూ ఉంటాడనీ లోకంలో ఒక కల్పిత కథ బహుళ ప్రాచుర్యం పొందింది. కాని, ఇది ఎంతమాత్రం సత్యంకాదు. సర్వవ్యాపకుడైన ఏకేశ్వరునికే యము డనే పేరు కూడా ఉంది. యమ పదం 'యము-ఉపరమే' అనే ధాతువుతో నిర్మించబడతుంది. అంటే - నియమించేవాడని అర్థం. జీవులు చేసిన కర్మల ఫలాలను అనుభవింపచేయటానికి ప్రాణులుగా సృజించి ప్రారబ్ధం పూర్తయిన తదుపరి ఆ శరీరం నుండి వేరు చేసి మరొక శరీరంలో ప్రవేశపెడతాడు. జీవుడు అవిద్యవల్ల తన అసలు స్వరూపాన్ని మరచి దేహమే తాననే భావంలో ఉంటాడు. దేహంపై మోహాన్ని పెంచుకుంటాడు. అది పోతున్నదంటే చాలా చాలా భయపడి పోతూ ఉంటాడు. ఈ మరణ భయాన్నే పతంజలి మహర్షి 'అభినివేశ' మన్నారు. ఈ అభినివేశ భయం పామరులకే కాక పండితులకు కూడా ఉంటుందట. ఆత్మజ్ఞానం బలపడినవారే నిర్భయంగా ఉండగలుగుతారు. పరమాత్మ సాక్షాత్కారం పొందినవారైతే యథేచ్ఛగానే "తేరీ ఇచ్ఛా పూర్ణహో" అంటూ శరీరాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోతారు. మహర్షి దయానందులవారు అట్లే చేశారు. వారు యమ పదమునకు ఈ క్రింది విధంగా

నిర్వచనం వ్రాశారు.

"సర్వ ప్రాణుల కర్మలకు అత్యంత న్యాయంగా ఫలాల ననుభవింపచేయ వ్యవస్థ చేసేవాడు, సర్వ అన్యాయాలనుండి వేరుగా ఉండేవాడు కనుక పరమాత్మకు యముడనిపేరు" అన్నారు. అంటే పరమాత్మ సుయోగ్యుడైన న్యాయాధీశుడు (Sincere Judge.)

**77)** రాహువు - పూర్వ పుటలలో కేతువు పదం వద్ద తెలుసుకున్నట్లే ఈ రాహువు పౌరాణిక నవగ్రహాలలోని రాహువు కాదు. (రహ–త్యాగే) - ఎవనిలో మరొక పదార్థం కలిసిపోలేదో - పరమ శుద్ధుడో, దుష్టులను దండించి శిష్టులను రక్షిస్తాడో అతడు రాహువు– పరమాత్మ.

**78)** రుద్రుడు - (రుదిర్ - అశ్రువిమోచనే (రోదనే)) రుద్రుడంటే ఏడిపించేవాడని మూలార్థం. ఏకేశ్వరునికే శివ నామంతో బాటు రుద్ర నామం కూడా ఉంది. కనుక దేవుడు అకారణంగా ఎవరిని బాధపెట్టడు. పాప ప్రక్షాళనకోసమే దుఃఖాలనిచ్చి ఏడిపిస్తాడు. ఆయనది తల్లికి ఉండే రౌద్రం వంటిది. తల్లి పిల్లవాడు బాగుపడాలని చెడుపని చేస్తే దండించి ఏడిపిస్తుంది. తరువాత హృదయానికి హత్తుకొని ఆదరిస్తుంది. అట్లే దేవుని రౌద్రంకూడా ఉంటుంది.

**79)** లక్ష్మి - (లక్ష - దర్శనాంకనయోః) - దర్శించునది, దర్శింపబడునది, దర్శించ తగినది లక్ష్మి. లోకంలో ఈ పదమును ఐశ్వర్యానికి, వివిధ సంపదలకు, ఐశ్వర్య సంపన్నులకు విశేషణంగా ప్రయోగింపబడుతుంది. నిజంగా కూడా ఐశ్వర్యాన్ని, అందాన్ని మనం దర్శించగోరుతూ ఉంటాము కదా! ఈ నామము ఏకేశ్వరునికి కూడా వర్తిస్తుంది. పూర్వం తెలిపినట్లుగా దేవునకు స్త్రీ పురుష నపుంసక లింగాల మూడిటిలోను పేర్లున్నాయి. అతడు లింగభేదంలేని సర్వవ్యాపక నిరాకారతత్త్వం. లక్ష్మీ పదమునకు ఋషులు ఈ విధంగా నిర్వచనం చెప్పారు - "చరాచరమగు సమస్త జగత్తును చూసేవాడు, సూక్ష్మరూపంలో ఉన్న మూలప్రకృతిని స్థూల జగత్తుగా చేసేవాడు, శరీరమందు కన్ను ముక్కు చెవులు నోరుమొదలగువానిని, వృక్షాలలో పత్ర పుష్ప ఫలాలను సృజించేవాడు, వాటిలో వివిధ రంగులను నింపి మనకు కనబడేటట్టు చేసేవాడు కనుక దేవునకు 'లక్ష్మి' అని పేరు. వేదాది శాస్త్రాలకు,

ధార్మికులు విద్వాంసులు నగు యోగులకు లక్ష్యంగా-చేరుకోవలసిన గమ్యంగా ఉండేవాడు కనుకను దేవునకు లక్ష్మి అని పేరు" అన్నారు.

**80)** <u>వసువు</u> - (వస-నివాసే) ఎవనిలో సర్వపదార్థాలు, సర్వప్రాణులు వసించుచున్నవో, ఎవరు సర్వ పదార్థాలలో వసించుచున్నాడో అతడు వసువు. (పంచభూతాలు, సూర్య చంద్ర నక్షత్రాలు మనకు వసువులు. వాటిలో, వాటివలన మనం నివసిస్తున్నాము. ఈ వసుదేవతలు కూడా దేవునిలోనే వసిస్తున్నాయి) "యస్మిన్ దేవా అధివిశ్వే విషేదుః" అంటుంది ఋగ్వేదం (1-164-39).

**81)** <u>వరుణుడు</u> -(వృఞ్-వరణే, వర- ఈప్సాయామ్) ముముక్షువులు, యోగులు ఎవనిని వరిస్తారో అతడు వరుణుడు. అట్టి యోగ్యులను దేవుడుకూడా వరిస్తాడు. స్వీకరిస్తాడు. లేక **"వరుణో నామ వరః శ్రేష్ఠః"** పరమేశ్వరుడు అందరికన్న శ్రేష్ఠుడు, వరింపదగినవాడు. కనుక వరుణ నామము వచ్చింది.

**82)** <u>వాయువు</u> - (వా - గతి గంధనయోః), (బలినాం బలిష్ఠః స వాయుః). గతి, గంధగుణములు కలిగినది సామాన్యవాయువు. వాయువు చాలా బలమైన గతి కలిగి ఉంటుంది. అట్టి బలమైనదానికన్నను బలిష్ఠుడు కనుక దేవునకు వాయు వని పేరు.

**83)** <u>విరాట్</u> - (వి+రాజ్బ-దీప్తౌ) వివిధ జగములను ప్రకాశింపచేయువాడు కనుక దేవునకు విరాట్ అని పేరు.

**84)** <u>విశ్వుడు</u> - (విశ-ప్రవేశనే) ఆకాశాది సర్వభూతాలు ఎవనిలో ప్రవేశించి ఉన్నాయో, ఎవరు వీటిలో వ్యాప్తుడై ప్రవేశించి ఉన్నాడో అతడు విశ్వుడు - దేవుడు.

**85)** <u>విశ్వంభరుడు</u> - (డు భృ ఞ్ - ధారణ పోషణయోః) జగత్తును ధరించి పోషించే వాడు కనుక దేవుడు విశ్వంభరుడు. (అథర్వ. 2-16-5).

**86)** <u>విశ్వేశ్వరుడు</u> - విశ్వమునంతటిని నియమించి నడిపించువాడు కనుక దేవుడు విశ్వేశ్వరుడు. (మైత్రోపనిషత్తు 5-14).

**87)** <u>విష్ణువు</u> - (విష్లృ-వ్యా ప్తౌ) చరా చర జగత్తులో అంతటా వ్యాపించి ఉంటాడు కనుక దేవునకు విష్ణు వని పేరు.

**88) <u>శక్తి</u>** - (శక్‌ఌ-శక్తౌ) సర్వజగత్తును తా నొక్కడే నిర్మించి నడుపగల శక్తిమంతుడు కనుక దేవునికి 'శక్తి' అని పేరు.

**89) <u>శంకరుడు</u>** - (శం+దృకృఞ్-కరణే) సుఖాలను, శుభాలను ఇచ్చేవాడు కనుక దేవునకు శంకరు డని పేరు.

**90) <u>శనైశ్చరుడు</u>** - (చర-గతి భక్షణయోః) దేవుడు సహజముగా అన్నిటిలో ప్రవేశించి ఉంటాడు. అత్యంత ధైర్యశాలి కూడా. (నవగ్రహాలలోని శని కాదు).

**91) <u>శివుడు</u>** - (శివు-కల్యాణే) కల్యాణ స్వరూపుడు, కల్యాణకరుడు గాన దేవునకు శివు డని పేరు.(యజుర్వేద 16వ. అధ్యాయం - నమకం).

**92) <u>శుక్రుడు</u>** - (ఈ శుచిర్-ప్రాతిభావే) దేవుడు అత్యంత పవిత్రుడు. అతనిని ఉపాసించే జీవులను కూడా పవిత్రం చేస్తాడు. కనుక అతనికి శుక్రు డని పేరు.

**93) <u>శుద్ధుడు</u>** - (శున్ధ-శుద్ధౌ) దేవుడు సదా శుద్ధుడు. తాను స్వయంగా పవిత్రుడై, సర్వ అశుద్ధులనుండి వేరుగా ఉంటూ తనను ఉపాసించేవారిని పవిత్రులను చేస్తూ ఉంటాడు కనుక దేవునకు శుద్ధు డను సార్థక నామం.

**94) <u>శేషుడు</u>** - (శిష్లృ-విశేషణే) పురుషసూక్తం ద్వారా పరమేశ్వరుడు తన విరాట్ స్వరూపాన్ని చక్కగా వర్ణించి చెప్పాడు. అందులోని ఒక మంత్ర మేమంటుందంటే-

**"పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి॥"** - యజుర్వేదం (31-3)

ఈ దృశ్యాదృశ్య బ్రహ్మాండాలన్నీ దేవునిలో ఏకపాదంగా (1/4 వంతుగా) ఉన్నాయి. మిగిలిన 3/4 భాగాలు అమృతలోకమే. అక్కడనే ముక్తపురుషులంతా దేవునినుండి ఆనందాన్ని, జ్ఞానాన్ని పొందుతూ స్వేచ్ఛగా విహరిస్తారు. ఈ అమృతలోకాన్నే వేదం **'శేషం'** అంటుంది. అంటే - అంతుబట్టని విశ్వాన్ని దేవుని పరిమాణంలో నుండి తీసివేస్తే మిగిలిన భాగాన్ని శేషం అంటుంది వేదం. ఇక్కడ శేషుడంటే - ఉత్పత్తి ప్రళయాల నుండి శేషించి ఉండేవాడు కనుక దేవునకు శేషు డని పేరు.

**95) <u>శ్రీ</u>** - (శ్రీ ఞ్-సేవాయామ్) విద్వాంసులచే, యోగులచే, మహాత్ములచే, సమస్త జగత్తుచే సేవింపబడువాడగుటచే దేవునకు శ్రీ యని పేరు.

## సగుణ నిర్గుణ బ్రహ్మల వివరణ

**96)** <u>సగుణుడు</u> - "యో గుణైః సహ వర్తతే స సగుణః"= గుణములతో కూడి ఉన్నవాడు సగుణుడని సామాన్యార్థం. ఏదైనా కొన్ని గుణములులేని పదార్థమే ఉండదు కదా లోకంలో! కనుక, ప్రతి పదార్థము కొన్ని గుణాలను కలిగి ఉంటుంది. కొన్ని గుణాలను కలిగి ఉండదు. అట్లే దేవునిలోనూ కొన్ని గుణాలు ఉంటాయి, కొన్ని గుణాలు ఉండవు. ఉదా : సర్వజ్ఞత, సర్వశక్తిమత్తత, పవిత్రత, ఆనందము మొదలైన అలౌకిక గుణాలు దేవునిలో అనేకం ఉన్నాయి. కనుక అతడు సగుణుడు. అతనిలో కామ క్రోధ లోభాది అరిషడ్వర్గాలు, పక్షపాతం, క్రూరత, స్వార్థ సంకుచిత భావాలు ఉండవు కనుక అతడు నిర్గుణుడు. నిర్గుణుడంటే అతనిలో అసలు గుణాలు ఉండనే ఉండవనికాదు. సగుణుడంటే లోకంలోని మొత్తం గుణాలన్నీ ఉంటాయనియు కాదు.

సగుణుడంటే సాకారుడనీ, నిర్గుణుడంటే నిరాకారుడనీ కొందరనుకుంటారు. అది వారి అజ్ఞానం. దేవునికి ఆకారం ధరించి అవతరించవలసిన అవసరమేముంది? దుష్టులకు రోగాలను, బాధలను కలిగించి చంపగలడు కదా! అవతరించి జన్మ జరా మృత్యువాది అవస్థలు పడటమెందుకు?

**97)** <u>సచ్చిదానందుడు</u> - సత్+చిత్+ఆనందము కలిసి = సచ్చిదానందము అవుతుంది. ఈ మూడింటిని కలిపి చెప్పినపుడు అది కేవలం పరమేశ్వరునికే వర్తిస్తుంది. ఎందుచేతనంటే - సత్ అంటే ఉనికి (Existence) గలది. అంటే త్రికాలాలలోనూ (భూత వర్తమాన భవిష్యత్‌లలోనూ) ఎప్పటికీ ఉండేది. అట్టివి ఈ లోకంలో 3 పదార్థాలున్నాయి. 1. సృష్టికి మూలపదార్థాలైన పరమాణువులు. ఈ పరమాణువులు 3 రకాలుగా ఉంటాయి. అవి - సత్త్వము, రజస్సు, తమస్సు. వీటిని ఆధునిక వైజ్ఞానిక భాషలో ప్రొటాన్, ఎలక్ట్రాన్, న్యూట్రాన్ లని అంటారు.

2. నేను, నేను అనుకుంటూ వ్యవహరించే జీవాత్మలు. ఇవి అనేకం ఉంటాయి. ప్రతీ ప్రాణిలోను ఒక జీవాత్మ ఉంటుంది. అవి వేరువేరు కదా! కనుక అనేకం.

3. పరమాణువులతో ఒకప్పుడు ప్రపంచంగాను, కాలాంతరంలో ప్రలయంగాను చేసే సర్వవ్యాపకమైన మహత్తరశక్తి ఒకటి ఉంది. అది సర్వజ్ఞము, సర్వశక్తివంతమునైన చేతన పదార్థం - జ్ఞానవంతమైన పదార్థం. కనుక మన వేదశాస్త్రాలు దానిని

దేవుడు అన్నాయి. ఈ శక్తులేకాక దేవునిలో 'ఆనందము' అనే అత్యద్భుతమైన గుణం ఉంది. అంటే - తెంపులేని అనిర్వచనీయమైన సుఖం. దానిని భగవద్గీత (6-21), "<u>సుఖమాత్యంతికం యత్తత్ బుద్ధి గ్రాహ్యమ్</u>+<u>అతీంద్రియం</u>"= అది ఇంద్రియాతీత ఆత్యంతిక సుఖం. దానిని పరిపూర్ణయోగి తన బుద్ధితో గ్రహించగలుగుతాడే కాని మాటలతో వర్ణించలేడు. ఈ లోకసుఖాలతో పోల్చలేడు అంటుంది. సచ్చిదానందాలను వేదం "భూర్భువఃస్వః" అంటుంది. ఇది గాయత్రీ మంత్రంలోని మొదటి పదములుగా ఉంటాయి. ఆ పద సముచ్చయం అక్కడ కేవలం సర్వవ్యాపక సర్వేశ్వరుని మాత్రమే సూచిస్తుంది.

**98)** <u>సత్ స్వరూపుడు</u> - (అస-భువి) పూర్వ పదంలో చెప్పుకొన్నట్లుగా సత్ అంటే ఉనికి (Existence) కలవాడు. అయితే ప్రకృతి కన్నా జీవులకన్న విశేషంగా దేవుడు త్రికాలాలలోను ఏకరసుడై ఉంటాడు. ప్రకృతి పరిణామం చెందుతూ ఉంటుంది. జీవులు ఒకప్పుడు ప్రకృతి బద్ధులై జనన మరణాలు పొందుతూ జైలులో ఉన్నట్లుంటారు. మరొకప్పుడు యోగసాధనలు చేసి ముక్తులౌతూ ఉంటారు. ఆనందమగ్నులౌతూ ఉంటారు. కనుక సత్ నామమునకు దేవుని పరంగా ఋషులు ఈ విధంగా నిర్వచనం చెప్పారు.

**"యదస్తి త్రిషు కాలేషు న బాధ్యతే తస్మాద్ బ్రహ్మ"** అన్నారు. దేవుడు త్రికాలలోను ఏ మార్పు చెందకుండా ఉంటాడు. కనుక అతడు బ్రహ్మము సత్ .

**99)** <u>సత్యము</u> - (సన్తీతి సన్తః, తేషు సత్సు సాధు తత్ + సత్యమ్) ఉనికిగల పదార్థాలను 'సత్' అంటారు. వాటిలో (పై మూటిలో) సాధు (గొప్పవాడు) కనుక దేవుని మరియొక నామము 'సత్యం'. (ఇక్కడ నిజమైన మాటలనికాదు).

**100)** <u>సరస్వతి</u> - (సృ-గతౌ) సరస్వతీ పదము గత్యర్థక సృ ధాతువుతో తయారౌతుంది. పూర్వం చెప్పుకొన్నట్లుగా 'గతి'లో జ్ఞాన గమన ప్రాప్తులు కలిసి ఉన్నాయి. అందులో జ్ఞానం ముఖ్యమైనది. అట్టి జ్ఞానాన్ని అనంతంగా కలిగి ఉన్నాడు కనుక అతనికి సరస్వతి యని మరొక పేరు. అది తెలుపటానికి ఋషులు **"సరో వివిధం జ్ఞానం విద్యతే యస్యాం చితౌ సా సరస్వతీ"** అని నిర్వచించారు. అంటే - "శబ్దార్థ సంబంధాన్ని యథావత్తుగా - ఉన్నది ఉన్నట్లుగా మాటలలో చెప్పగల అద్భుత జ్ఞాని" అని అర్థం

వస్తుంది. సామాన్య విద్వాంసులకు శబ్దము, దాని అర్థము, పదార్థానికి దాని నామమునకు గల సంబంధము కొంతవరకే తెలుస్తాయి. పూర్ణంగా తెలియవు. కాని, దేవుడు అవన్నీ పూర్ణంగా తెలిసినవాడు. కనుక అతని కావ్యమైన వేదంలో నిరర్థక పదము ఒక్కటికూడా ఉండదు. కనుక తొందరపడి వేదంలో తప్పులు వెదుక ప్రయత్నించవద్దు. అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యాలి. అంతర్ముఖులై అర్థం తెలుపమని అంతరాత్మను ప్రార్థించాలి.

**101)** <u>సర్వ శక్తిమంతుడు</u> - "సర్వా శక్తయో విద్యన్తే యస్మిన్ స సర్వశక్తిమాన్ ఈశ్వరః = తన కార్యాలైన సృష్టి స్థితి ప్రలయాలను చేయటంలోను, కోటానుకోట్ల జీవులు మనోవాక్కాయాలతో చేసే కర్మలకు అత్యంత న్యాయంగా ఫలాలనిచ్చి - అందుకు తగిన శరీరాలను నిర్మించటంలోను వేరొకరి సహాయ సహకారాలు దేవునకు అవసరంలేదు. కనుక అతడు సర్వ శక్తిమంతు"డని ఋషులు నిర్వచనం చెప్పారు.

కొందరు ఈ పదమును పొరపాటుగా అర్థం చేసుకుంటారు. లోకంలో ఇన్ని ఘోరాలు, నేరాలు, కుంభకోణాలు, ఖూనీలు, అత్యాచారాలు జరుగుతూ ఉంటే దేవుడు చూస్తూకూడా ఎందుకు నివారించలేక పోతున్నాడంటారు. కొందరైతే మాకు దేవుని ఉనికిపైనే నమ్మకం పోతున్నదంటారు. దేవుడు అకృత్యాలుచేసేవారి చెయ్యిపట్టుకుని ఆపడు. అంతర్యామిగా ఉండి హెచ్చరిస్తూ ఉంటాడు. వినకపోతే ఆ పాపాలకు తగిన ఫలాలను, శిక్షలను - క్రిమి కీటకాది జన్మలను, కష్టాలను, బాధలను కలిగిస్తాడు. అన్యాయానికి గురియైన వారికి కాలాంతరంలో లేదా జన్మాంతరంలో తగిన సుఖాలను ప్రసాదిస్తాడు. దేవుడు అత్యంత న్యాయకారి.

**102)** <u>సవిత</u> - (షుఞ్-అభిషవే, షూఙ్ - ప్రాణిగర్భవిమోచనే) ఈ రెండు ధాతువులతోను సవితా పదము తయారు చేయవచ్చు. అభిషవం అంటే- యజ్ఞానంతరస్నానం అనీ సోమలతనుండి రసంతీయటం అని రెండర్థాలు చెబుతారు విద్వాంసులు. ఇక్కడ దేవుని పరంగా పరమాణువులనుండి స్థూలసృష్టిని చేయువాడని అర్థంవస్తుంది. 'ప్రాణి గర్భవిమోచనం అంటే ప్రాణుల ప్రసవక్రియ. సృష్టికి పూర్వం విశ్వమంతా ఒక ముద్దగా దేవుని గర్భంలో ఉండేదట. దానినే వేదం "హిరణ్యగర్భః సమవర్తత + అగ్రే భూతస్య జాతః పతిర్ + ఏకః + ఆసీత్" - యజుర్వేదం (13-4) అంటుంది.

అంటే "సృష్టికి పూర్వం దేవుడు హిరణ్యగర్భుడుగా ఉండి జగత్‌లోని పంచభూతాలను, ప్రాణులను ప్రసవించాడు. అతడు ఒకే ఒక్కడు" అని అర్థం. హిరణ్యం అంటే లోకభాషలో బంగారం. కాని, వైదిక భాషలో "హిరణ్యం వై జ్యోతిః" (శతపథబ్రాహ్మణం). హిరణ్యం అంటే ప్రకాశించే సూర్యనక్షత్రాదులని అర్థం. కనుక ఇక్కడ సవితా పదమునకు జగదుత్పాదకుడని అర్థం వస్తుంది. పెక్కు వేదమంత్రాలలో సవితా పదము దేవుని పరంగా చెప్పబడింది.

ఇంతేగాక, 'షూ-ప్రేరణే' అనే ధాతువుతో కూడా సవితా పదం నిర్మించవచ్చునంటారు. కనుక, దేవుడు జీవులమైన మనకు అంతర్యామిగా ఉండి ప్రేరణ కలిగిస్తున్నాడు. కనుక సవితా పదమునకు ప్రేరకుడని కూడా అర్థం చెప్పవచ్చును.అతడు మనలో అంతర్యామిగా ఉండి సత్కర్మలు చేస్తుంటే ధైర్యం, ఉత్సాహం, ఆనందం కలిగిస్తూ ఉంటాడు. చెడు కర్మలు చేస్తుంటే శంక, భయం కలిగిస్తాడు.

లోకంలో చాలా మంది పౌరాణికులలో సవిత అంటే ఆకాశంలో కనబడే సూర్యు డనే భావం ఉంది. గాయత్రీ మంత్రంలోని సవిత పదమును కూడా అట్లే అర్థం చేసుకొని గాయత్రీ మంత్రంతో సూర్యునికి అర్ఘ్యం (జలం) అర్పిస్తూ ఉంటారు. కాని, ఇది సరికాదు. భౌతిక సూర్యునిలో ప్రేరణచేసే కొన్ని గుణాలున్నాయి. అట్లని ప్రార్థనా మంత్రాలలో సవిత అంటే సూర్యుడనుకోవటం పొరబాటే. ఎక్కడైనా సూర్యవిజ్ఞానాన్ని తెలిపే మంత్రాలలో సవిత పదం వస్తే అక్కడ సూర్యపరంగా అర్థంచెప్పుకోవచ్చు.

**103)** <u>సుపర్ణుడు</u> - సుపర్ణుడంటే మంచి రెక్కలు గలవాడని సామాన్య అర్థం. అయితే, రెక్కలు దేవునికి, జీవునకు ఉండవు కదా! అందుకని ఇక్కడ జ్ఞానము, కర్మ (ప్రయత్నం) అనే రెండు రెక్కలుగా అర్థం చెప్పుకుంటే సమంజసంగా ఉంటుంది. ఇక్కడ పరిపూర్ణమైన జ్ఞానం, అనంతమైన సృష్టికార్యం అనే రెండు రెక్కలుగలవాడు దేవుడు అని అర్థం చేసుకోవాలి. (జీవునిగురించి సుపర్ణపదము వచ్చినపుడు స్వల్పజ్ఞానం, స్వల్ప కర్మ రెక్కలుగా కలవాడని అర్థం చేసుకోవాలి.)

**104)** <u>సూర్యుడు</u> - (సృ-గతౌ) సూర్యః సర్తేర్వా, సువతేర్వా, స్వీయతేర్వా (నిరుక్తం. 12-14) సూర్యుడంటే ప్రకాశ స్వరూపుడు. "సూర్య ఆత్మా జగతస్తుషశ్చ"

-యజుర్వేదం (7-42). స్థావర జంగమ ప్రాణులన్నిటిలో ఆత్మసూర్యునిగా - అంతరాత్మగా దేవుడున్నాడు. ఇంతేగాక, స్వయం ప్రకాశకాలైన సూర్య నక్షత్రాదులకును ప్రకాశమునిచ్చు ఆధార సూర్యుడు దేవుడు (అథర్వ. 13-2-19) .

**105)** <u>స్వయంభువుడు</u> - (భూ-సత్తాయామ్) అతని ఉనికికి మరొక కారణం లేదు కనుక దేవుడు స్వయంభువుడు. అంటే - దేవుడు ఎవరివలన పుట్టలేదు. తనంతతానుగా ఉన్నవాడు.

**106)** <u>స్వరాట్</u> - (యః స్వయం రాజతే స విరాట్) దేవుడు స్వయం ప్రకాశకుడు. లోకంలో సూర్యనక్షత్రాలను స్వయం ప్రకాశకాలని చెప్పుకుంటూ ఉంటాము. కాని, వాటిలోని ప్రకాశానికి కారణం హైడ్రోజన్ హీలియంగా మార్పు చెందుతూ ఉండటం వల్ల పెద్ద పెద్ద మంటలు లేస్తూ ఉన్నాయి. అందుచే సూర్యుడు స్వయం ప్రకాశకుడనుకుంటాము. అప్పుడప్పుడు సూర్యునిలో అక్కడక్కడ ఈ న్యూక్లియర్ ఫ్యూషన్‌క్రియ స్వల్పంగా జరుగుతుందట. అవి వైజ్ఞానికులకు మచ్చలుగా కనబడుతున్నాయట. వీటికి వారు సన్ స్పాట్స్ (Sun Spots) అని పేరుపెట్టారు. ఆ సూర్యుని మచ్చలకు భూవాతావరణానికి సంబంధముందట. తుఫానులు, అతివృష్టి అనావృష్టులకు సన్‌స్పాట్సు కారణమని కొందరు వైజ్ఞానికులంటున్నారు. కాని, దేవుని ప్రకాశంలో ఇట్టి లోపాలేమీ ఉండవు. అతడు స్వరాట్ - నిజమైన స్వయం ప్రకాశకుడు.

**107)** <u>హిరణ్యగర్భుడు</u> - పూర్వం 102వ నామము 'సవిత' లో వివరించినట్లు హిరణ్యగర్భుడంటే - సూర్యనక్షత్రాది ప్రకాశక గోళాలను తన గర్భంలో కలవాడని అర్థం వస్తుంది. "హిరణ్యం వై జ్యోతిః" (శతపథ బ్రాహ్మణం) అని ఋషుల వివరణ. ఇది తెలియని వేద భాష్యకారులు - "హిరణ్యం అంటే బంగారం కదా! బంగారాన్ని కనిపెట్టిన తరువాతనే వేదాలు వ్రాయబడ్డా"యని వ్యాఖ్యానించారు. మహర్షి దయానందుల వారు పై ఋషుల వాక్యాలను వెలుగులోనికి తెచ్చేవరకు వారి అజ్ఞానం పోలేదు. మహర్షి భాష్యం చదివిన వివేకవంతులు మాక్స్‌మూలర్ మొదలగువారు తమ తప్పిదాన్ని తెలుసుకొని సవరించుకున్నారు. వేదాలు సృష్ట్యాదిలోనే ప్రకాశింపబడ్డాయని అంగీకరించారు.

**108) హోతా** - "(హు-దాన+అదనయోః ఆదానే చ)" అనే ధాతువుతో హోత్ర పదము తయారౌతుంది. అగ్నిహోత్రం మనం వేసే ఆహుతిని ఆదానం = స్వీకరిస్తుంది. అదనం = తిని జీర్ణం చేసుకుంటుంది. ఆ సారాన్ని - అణువులను తిరిగి దానం చేస్తుంది. గాలిలో కలిపివేస్తుంది. కనుక అది హోత్రం. అట్టి అగ్నిహోత్రంలో "యః జుహోతి స హోతా= ఆహుతి ఇచ్చేవాడు హోత అవుతాడు. మనం ఇక్కడ దేవుని పరంగా అర్థం చెప్పుకుంటే - సృష్టికార్యం అనే యజ్ఞంలో పరమేశ్వరుడు మూల ప్రకృతిని ఆహుతిగా అర్పిస్తూ సృష్టికార్యాలను ముఖ్యంగా జీవులకొరకు వారి మేలుకొరకు చేస్తున్నాడు. సృష్టిరూప యజ్ఞంలో దేవుడు హోత. జీవులు ప్రయోజనం పొందే వారు. ఇంతేగాక, జీవులకు దేవుడు స్వీకరించ తగిన కోరతగిన అప్పుడు, ఆనంద స్వరూపుడు కనుక అతడు హోత. కర్మ ఫలాల దాత.

పై అష్టోత్తర శత (108) నామములను మహర్షి దయానందుల వారు తమ జగత్ప్రసిద్ధ సత్యార్థప్రకాశంలో సంస్కృత నిర్వచనాలతోను, సంక్షిప్త హిందీ వివరణతోను ప్రథమ సముల్లాసంలో తెలిపారు. వాటి ఆధారంతోనే తెలుగువారికి అర్థంకావటానికి కొద్ది వివరణతో మేము ఇంతవరకు వ్రాశాము. నాలుగు వేదాలలోను దేవుని నామములు మరెన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని ముఖ్యమైన వాటిని చివరలో అనుబంధంగా చేర్చే ప్రయత్నం చేస్తాము.

ముఖ్యంగా వేదాలు దేవుడు ఒకే ఒక్కడంటాయి. పొరబడకుండా ఉండేందుకు అథర్వవేదం 13-4-16,17,18 మంత్రాలలో **'న ద్వితీయో న తృతీయోశ్చతుర్థో నా ప్యుచ్యతే....... య ఏతం దేవమేకవృతం వేద'**॥= సృష్టి స్థితి లయకర్త ఒకే ఒక్కడు. ఇద్దరుగాని, ముగ్గురుగాని, నలుగురుగాని లేనేలేరు. అతడు ఒకే ఒక్కడు అంటుంది. మతానికి ఒక దేవుణ్ణి, సంప్రదాయానికి ఒక దేవుణ్ణి చేసుకొని రాగద్వేషాలను, వైషమ్యాలను పెంచుకోవటం మంచిదికాదు. మీ దేవునికన్న మా దేవుడు గొప్ప అనుకోవటం కూడా పొరబాటే. మన శరీరాలన్నీ ఒకే కర్మాగారంలో తయారైనట్లు శరీర నిర్మాణ శాస్త్రం Anatomy, శరీర ధర్మ శాస్త్రం Physiology చెబుతున్నాయి కదా! ఇంతకన్న పెద్ద సాక్ష్యం ఏది? మీరంతా బుద్ధిమంతులే కదా! ఆలోచించండి.

# పరమేశ్వర స్తుతి ప్రార్థనోపాసనలు ఎందుకు? ఎలా చేయాలి?

మనకు ఉత్తమమైన మానవజన్మనిచ్చి, వికసించిన ఇంద్రియాలను, వాటితో భోగించుటకు సృష్టిలో శబ్ద స్పర్శ రూప రసాది విషయాలను సృష్టించిన దేవునకు కృతజ్ఞతలు తెలుపటం ప్రతీ మానవుని కనీస కర్తవ్యం. లేకుంటే-మనం కృతఘ్నులమౌతాము. చేసిన, చేస్తున్న మేలును మరచిన పాపాత్ములమౌతాము. అయితే వాటిని మనం జ్ఞాన పూర్వకంగా చెయ్యాలి. మూఢ నమ్మకాలతో కాదు.

<u>స్తుతి :</u> స్తుతించటమంటే దేవుని గుణగణాలను ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకొని కీర్తించటం. అందువల్ల మనకు దేవుని యథార్థ స్వరూపం అవగతమై మనకు అతనిపై భక్తి శ్రద్ధలు కలుగుతాయి. దానితో మనం అతనికి చేరువవుతాము. ఎంతగా మనకు దేవుని గుణగణాలు, దివ్యశక్తులు తెలుస్తాయో అంతగా మన భక్తి బలపడుతుంది. అందుచేతనే ఈ పుస్తకంలో దేవుని 100కు పైగా యథార్థ గుణాలను వివరించి వ్రాయటం జరిగింది.

సగుణస్తుతి, నిర్గుణస్తుతి యని స్తుతి రెండు రకాలుగా ఉంటుంది. ఎట్లంటే-

"స బ్రహ్మ, స విష్ణుః, స రుద్రః, స్సశివస్సోஉక్షర స్స పరమః స్వరట్। స ఇంద్ర స్స కాలాగ్ని స్స చంద్రమాః..." అని కీర్తించటం సగుణ స్తుతి - దేవుడు ఏఏ గుణాలు కలిగి ఉంటాడో వాటిని కీర్తించటం అన్నమాట.

స పర్యగాత్ శుక్ర <u>మకాయ మవ్రణ మస్నావిరం శుద్ధమపాప విద్ధం</u>.... (40-1)" అని గాని, "<u>అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం</u> <u>తథారసం నిత్య మగంధవ చ్ఛ యత్</u>" (కఠోపనిషత్తు-3-15) అనిగాని స్తుతించటం నిర్గుణ స్తుతి. దేవుడు ఏ ఏ గుణాలు కలిగి ఉండడో వాటిని కీర్తించటం నిర్గుణ స్తుతి అన్నమాట. ఈ రెండూ అవసరమే.

<u>ప్రార్థన</u> : మనం చేయగలిగినంత ఎక్కువగా ప్రయత్నం చేస్తూ దానికి పరమేశ్వరానుగ్రహం కూడా అవసరం కనుక హృదయపూర్వకంగా అంతర్యామిని ప్రార్థించాలి. ఏదైనా కార్యం ఫలిస్తే గర్వపడకూడదు. దేవుని దయగా భావించాలి.
<u>ఉపాసన</u> : పైన వివరించిన స్తుతి ప్రార్థనలను మనం అంతర్ముఖులమై మనలో

అంతర్యామిగా, అతిసమీపంగా ఉన్న పరమేశ్వరుసకు వినిపించటమే ఉపాసన. ఎంత అంతర్ముఖులమైతే అంత ఆనందం కలుగుతుంది. విపరంగా తెలుసుకోగోరువారు సత్యార్థప్రకాశం సప్తమ సముల్లాసంలో చూడండి.

## మంగళాచరణం-శాంతిపాఠం

ఆధ్యాత్మిక గ్రంథాలు వ్రాసిన మన ప్రాచీన ఋషులంతా 'ఓం' అని గానీ 'అథ' అని గానీ ముందు వ్రాసి గ్రంథాన్ని ప్రారంభించేవారు. అథ పదము అధికారార్థాన్ని (యోగ్యతను) సూచిస్తుంది.

ఉదా : ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత (ఛాందోగ్యోపనిషత్)

ఓమిత్యేత దక్షర మిదం సర్వం తస్యోపవ్యాఖ్యానమ్ (మాండూక్యోపనిషత్)

అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః (వైశేషిక దర్శనం)

అథాతో ధర్మ జిజ్ఞాసా (పూర్వమీమాంసా దర్శనం)

అథాతో బ్రహ్మ జిజ్ఞాసా (వేదాంతదర్శనం)

అథ యోగానుశాసనమ్ (యోగదర్శనం)

అథ త్రివిధ దుఃఖాత్యంత నివృత్తిరత్యంత పురుషార్థః (వైశేషిక దర్శనం)

ఈశ్వరీయమైన వేదం కూడా -

ఓం అగ్ని మీళే పురోహితం ...... (ఋగ్వేదం)

ఓం ఇషేత్వోర్జేత్వా ........... (యజుర్వేదం)

ఓం అగ్న ఆయాహి వీతయే ........ (సామవేదం)

ఓం యే త్రిషప్తాః ........... (అథర్వవేదం)

అంటూ ప్రారంభింపబడ్డాయి.

అట్టి పరంపర ఇప్పుడు కల్పిత దేవీ దేవతల నామములతో ప్రారంభింపబడుతోంది. శ్రీ గణేశాయ నమః, సీతారామాభ్యాం నమః, హనుమతే నమః, రాధాకృష్ణాభ్యాం నమః మొదలగు మంగళాచరణాలతో ప్రారింపబడుతున్నాయి. "హరిః ఓం" కూడా మధ్యకాలీన కల్పితమే. కాబట్టి గ్రంథ ప్రారంభంలో ఓం అనికాని, అథ అనికాని వ్రాయటం ఉత్తమం. దానితోబాటు ఒక ప్రార్థనతోకూడిన

వేదమంత్రం వ్రాయవచ్చు.

## శాంతిపాఠం

గ్రంథాన్ని ముగించేటప్పుడు "ఓం శాంతిః శాంతిః శాంతిః" అంటూ ముగించటం ఉత్తమం. మానవులకు కలిగే అనేక కష్టాలను 3 వర్గాలుగా చేసి వ్యవహరించారు మన ప్రాచీన ఋషులు. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖాలన్నీ శాంతించాలని-ఉపశమించాలని దీని భావం.

**ఆధ్యాత్మిక దుఃఖాలంటే** – శారీరకమైన రోగాదులు, మానసికమైన అవిద్యా రాగద్వేషాలు, అనేకరకములైన చింతలు, భయాలు, అనుమానాలు.

**ఆధిభౌతికదుఃఖాలు** : ఇతర ప్రాణులవల్ల కలిగే దుఃఖాలను ఆధిభౌతిక దుఃఖాలంటారు. శత్రువులవల్ల గాని, మనపై ద్వేషంతో మనను ఇబ్బందులలో పడవేసే వారి వల్లగాని లేదా తేలు, పాము, కుక్కలు మొదలగు ప్రాణులవల్లగాని వచ్చే దుఃఖాలు.

**ఆధిదైవికదుఃఖాలు** : అతివృష్టి, అనావృష్టి, ఎక్కువ శీత ఆతపాలు, వరదలు భూకంపాలు మొ. వాని వల్ల కలిగే దుఃఖాలు.

ఇవన్నీ శాంతించాలని శాంతిపాఠ భావం. ఇంతేకాని, శ్రీ రామార్పణమస్తు, శ్రీ కృష్ణార్పణమస్తు అని ముగించటం అంత సమంజసంకాదు. ఆ చారిత్రక పురుషులు కర్మయోగులు, తపస్వులు, ధర్మమూర్తులు కనుక వారు ముక్తి పొంది ఉంటారు. వారికి మన మెట్లు అర్పించగలం?

## ఉపసంహారము (Conclusion)

**ప్రియపాఠకులారా!**

మీరింతవరకు దేవుడు ఒకే ఒక్కడనీ, అతనికే అనేకానేక నామములనీ (పేర్లనీ) హేతుబద్ధంగా, శాస్త్రబద్ధంగా, వైజ్ఞానికంగా తెలుసుకున్నారు. అతడు సర్వవ్యాపకుడనీ, సర్వశక్తిమంతుడనీ ఇతరుల సహాయం లేకుండా తానొక్కడే సృష్టి స్థితి ప్రలయాలు మూడింటినీ చేస్తున్నాడనీ తెలుసుకున్నారు. దేవుడు అత్యంత న్యాయకారియనీ, కోటానుకోట్ల జీవులకు వారు పూర్వ మానవజన్మలలో చేసిన అనేకానేక మనోవాక్కాయ కర్మలకు సరియైన ఫలితాలనిస్తున్నాడనీ తెలుసుకున్నారు,

మంగళాచరణం (గ్రంథారంభం), శాంతిపాఠం (ముగింపు) ఎలా ఉండాలోకూడా సంక్షిప్తంగా తెలపటం జరిగింది.

దయచేసి ఈ విషయాలు మీ బుద్ధితో మననం చేసి మీకు సత్యమనిపించిన వాటిని స్వీకరించండి. లేకున్న ప్రక్కకు పెట్టండి. మేము వ్రాసినవి మాత్రం శాశ్వత సత్యాలు. ఋతాలు (సృష్టి నియమాలు). మతానికి ఒక దేవుడు, సంప్రదాయానికి ఒక దేవుడు, వర్గానికి ఒక దేవుడు ఉండరు. మతాల పేరుతో, సంప్రదాయాల పేరుతో వర్గాల పేరుతో ఒకరిని ఒకరు ద్వేషించుకుంటూ మా దేవుడే గొప్ప అనుకోవటం ఎంతమాత్రం మంచిదికాదు. మనమందరం ఒకే దేవుని బిడ్డలం.

**"అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే సంభ్రాతరో వావృధుః సౌభగాయ ।** = ఓ మానవులారా! మీలో ఒకరు ఎక్కువగాని, ఒకరు తక్కువగాని కారు. మీరంతా పరస్పరం సోదరులు. కనుక, అందరు కలిసిమెలసి సౌభాగ్యాలను-అభ్యుదయ నిశ్శ్రేయసాలను పొంద యత్నించండి" అంటుంది ఋగ్వేదం (5-60-5). కనుక, వేదమార్గాన్ని అనుసరిద్దాం రండి.

**"ఏకం సత్ విప్రా బహుధా వదన్తి"**

**సభ్‌కా మాతా పితా ఏక్ హై।**

మనందరికి తల్లీ తండ్రీ ఆ పరమేశ్వరుడే

God is one, God is one, God is one for everyone

God is here, God is there, God is every where

**"లోకాః సమస్తాః సుఖినో భవంతు".**

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

## అనుబంధము (Appendex)

## దేవుని అనేక నామములలో మరికొన్ని

1. అంగ = అంగము అంటే శరీరంలోని ఒక భాగము. చాలా ప్రియమైన వాటిని కూడా అంగము అనవచ్చు. "అతడు నా కుడిభుజం వంటివాడు" అని లోకంలో ప్రయోగం ఉందికదా! వేదాలలో అక్కడక్కడ దేవుని "ఓ అంగ!" అనే నామముతో పిలిచినట్లు ప్రయోగింపబడింది (ఋ. 1-1-6).

2. అంగిరుడు = ప్రాణప్రియః జగదీశ్వరః (యజు. 3.3).

3. పురుహూతుడు = బహు విద్వాంసులచే పూజింబడువాడు! (యజు. 18-69). పురుప్రియ=బహు విద్వాంసులకు ప్రియమైనవాడు (యజు. 15-31).

4. స్కంభమ్ = స్తంభమని సామాన్యార్థం. వేదాలలో కొన్నిచోట్ల దేవుడు స్తంభమువలె జగదాధారుడనీ, సర్వజగద్ధారక పరమేశ్వరా! అనీ ప్రయోగాలున్నాయి. అథర్వవేదం 10-7,8 సూక్తాలలో చాలా మంత్రాలలో ఈ పదము వస్తుంది.

5. శతక్రతువు = శతమంటే 100 అని అర్థం. కాని, నిఘంటువులో బహు నామములలో (అనేకం అనే అర్థం గలవి) 12 ఉన్నాయి. అవి ఏవంటే- ఉరు, తువి, పురు, భూరి, శశ్వత్, విశ్వమ్, పరీణసా, వ్యానశిః, శతమ్, సహస్రమ్, సలిలమ్, కువిత్.

కనుక, శతక్రతుః అంటే అనేక కర్మలు చేయువాడు (క్రతురితి కర్మనామ) - పరమేశ్వరుడనే అర్థంలో ప్రయోగింపబడింది.

6. జాతవేదుడు = పుట్టిన పదార్థాల నన్నిటిని ఎరుగువాడని సామాన్యార్థం. ఈ పదం అగ్నిహోత్రకార్యంలో సామాన్యాగ్నికి - యజ్ఞాగ్నికి వర్తిస్తుంది.

ప్రార్థనా మంత్రాలలో దేవునికి వర్తిస్తుంది. సామాన్యాగ్ని మనకు కొన్ని వస్తువులను మాత్రమే చూపగలుగుతుంది. కాని, దేవుడు సంపూర్ణ విశ్వంలోని పదార్థాలన్నిటిలో వ్యాపించి ఉన్నాడు కదా! కనుక, దేవుడే నిజమైన - పూర్ణమైన జాతవేదుడు. (యజు. 12-16).

7. సుమృడీకుడు = శ్రేష్ఠ సుఖములనిచ్చు దేవుడు (యజు. 20-51).

8. సుప్రకరస్నుడు = సర్వత్రా వ్యాపక కరములు గలవాడు (ఋ. 8-32-10).

9. ప్రియస్తోత్రుడు = స్తుతించ తగిన ప్రియుడు (ఋ. 1-11-9).

10. వనస్పతి = భక్తుల పాలకుడు (ఋ. 1-11-9).

11. సుక్షత్రుడు = మంచి రక్షకుడు (ఋ. 7-89-4).

12. సమహా = తేజోమయ ప్రభువు (ఋ. 7-89-3).

13. యజిష్ఠుడు = పూజనీయ ప్రభువు (ఋ. 5-14-2).

14. విచర్షణుడు = విశేషద్రష్ట, సర్వశక్తిమంతుడు (ఋ. 9-45-19).

15. వృషక్రతుః = గొప్ప బుద్ధికలవాడు (ఋ. 6-45-19).

16. దస్మ = పాపనాశక ప్రభువు (ఋ. 1-4-6).

17. అచర కృషత్‌డు = ఆకర్షించేవాడు (సా. పూర్వార్థం 3-11-3).

18. ప్రచేతసుడు = మిక్కిలి జ్ఞానవంతుడు (ఋ. 3-1-4-2).

19. అభ్రాతృవ్యుడు = శత్రురహితుడు (ఋ. 8-21-13).

20. అనాపిః = సంసారమోహరహితుడు (ఋ. 8-21-13).

21. అశ్విన్ = (అశూజ్-వ్యాప్తౌ) వ్యాపకగుణం కలిగి ఉండే రెండు జంట శక్తులను 'అశ్విన్' అని ద్వివచనంలో చెబుతారు. ఈ పదమే వేదాలలో 'అశ్వినా' గా ప్రయోగింపబడింది. ఈ పదము వినగానే అశ్వనీ దేవతలనబడే వైద్యదేవతలని (Doctors అని) పెక్కురనుకుంటారు. అదియును ఆది భౌతికార్థంలో (ప్రాణుల పరంగా) సరిగానే ఉంది. ప్రాచీనకాలంలో వైద్యులు ఔషధీవైద్యం+శస్త్రచికిత్స రెండూ తెలిసినవారై ఉండేవారు. మందులతో సాధ్యపడని వ్యాధులకు శస్త్ర చికిత్సలు చేసేవారు. నేటి భాషలో Physicians and Surgeons అని చెప్పవచ్చు. వేదాలు వైద్యులనేకాక గురుశిష్యులను, అధ్యాపక ఉపదేశకులను, తల్లిదండ్రులను కూడా అశ్విన్ అని పేర్కొంటాయి. వీరుకూడా మనను మంచి ఆదర్శమార్గంలో నడుపుతూ సామాజిక రుగ్మతలు, దుర్వ్యసనాలు అంటకుండా కాపాడుతూ ఉంటూరు కదా!

వారి బోధనలు వారితోనే పరిమితంకాక తరతరాలలో వ్యాపిస్తూ ఉంటాయి కనుక అట్టివారినికూడా అశ్వనీ దేవతలంటాయి వేదాలు. ఆదిదైవికార్థంలో (జడ దేవతల పరంగా) సూర్య చంద్రులను, భూలోక ద్యులోకలను, రాత్రీ పగలును,

శీతోష్ణాలను అశ్వినులుగా వేదం అక్కడక్కడ పేర్కొంటుంది. వాటి దివ్యశక్తులు కూడా వ్యాపకగుణం కలిగి ఉంటాయట. అందుకని అవికూడా అశ్వనీ దేవతలే. వివరంగా తెలుసుకోగోరువారు నా రచన "వేదాలలో అశ్వనీదేవత" లలో చూడగోరుచున్నాను.

ఇక మనం అశ్వినా పదము దేవునకు ఎట్లు వర్తిసుందో తెలుసుకుందాము. సృష్టిప్రలయాలు రెంటిని చేయగల ఏకేశ్వరుడు కనుకను, లోకాలోక శక్తులు రెంటినీ కలిగిన వాడగుట చేతను వేదాలలో అక్కడక్కడ దేవుని అశ్వినా నామంతో పేర్కొనబడింది.

ఉదా : ప్రాతరగ్నిం ప్రాతరిన్ద్రం హవామహే, ప్రాతర్మిత్రా వరుణా ప్రాతరశ్వినా । (ఋ. 7-41-4), (యజు. 34-34), అథర్వ (3-16-1) పరమేశ్వరార్థంగా చెప్పబడింది. కొందరేమంటారంటే - పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు కదా! అట్లే అతని శక్తికూడా లోకమంతా వ్యాపించి ఉన్నదికదా! కనుక దేవుడు+అతని శక్తి = అశ్వినా అనవచ్చునంటారు.

**22. పూషణుడు** : (పూష పుష్టౌ) దేవుడు సర్వపదార్థాలలోను లోపల వెలుపల వ్యాపించి ఉంటూ వాటికి పుష్టిని (వాటికా శక్తులను) కలిగిస్తూ పుష్టివంతం చేస్తున్నాడు కనుక దేవునకు పూషణుడనే పేరుకూడా ఉంది.

**23. బ్రహ్మణస్పతి** : (బృహ, బృహి-వృద్ధౌ) పెద్దది గొప్పది అయినది బ్రహ్మ. సృష్టి అంతా దేవునిలో ఏకపాదంగా ఉంది కనుక దేవుణ్ణి బ్రహ్మ అంటుంది వేదం. ఇంతేగాక, లోకంలోని వివిధ జ్ఞానాలలో వేదమే గొప్పది. దానినుండే అన్నిరకాల సత్యమైన విద్యావిజ్ఞానాలు విస్తరించాయి. కనుక వేదాన్నికూడా బ్రహ్మ -గొప్పజ్ఞానం అన్నారు ఋషులు. అట్టి వేదాలను ఇచ్చినవాడు కూడా దేవుడే కనుక అతనిని బ్రహ్మణస్పతి అంటుంది వేదం ప్రాతః స్మరణ మంత్రాలలో. ఇంతేగాక, ఈ ప్రాత స్మరణ మంత్రాలలో దేవుణ్ణి జితం, ఉగ్రమ్, అదితిః, మఘవన్ అనే నామములతో కీర్తిస్తుంది. కేవలం ప్రాతఃస్మరణ సూక్తంలోనే 13 నామములున్నాయి.

**24. మఘవన్** : మఘం అంటే కూడా ధన మనియే అర్థం, యాస్కమహర్షి తన వేద నిఘంటువులో ధన నామాలు 28 వ్రాశారు. వేద నిఘంటువంటే వేదాలలో ఆ యా నామాలకు పేర్కొన్న పర్యాయ పదములని గ్రహించాలి. మఘం అంటే ధనం కనుక, దానిని పుష్కలంగా కలవాడు కనకను, ఆ ధనాలను సృష్టించినవాడుకూడా అతనే

కనుకను అతనిని మఘవన్ అంటుంది వేదం. భగవన్ అన్నట్లుగా.

**25. కః** : సామాన్య సంస్కృత భాషలో కః అంటే ఎవరు? అనే ప్రశ్నార్థకం. కాని, వేదాలలో ముఖ్యంగా హిరణ్యగర్భ సూక్తాలలో ధృత వాక్యంగా "కస్మై దేవాయ హవిషా విధేమ" అనే వాక్యం వస్తుంది. అక్కడ ఆ వాక్యానికి ఏ దేవునికొరకు హవిస్సు నర్పించి నమస్కరించాలి? అని ప్రశ్నించటంకాదు. బ్రాహ్మణ గ్రంథాలలో అంటే ఋషులు వ్రాసిన వేదవ్యాఖ్యాన గ్రంథాలలో ""కః వై ప్రజాపతిః" అని వ్యాఖ్యానించారు. సర్వ జీవుల పతియైన ప్రజాపతికే 'కః' అనే ఒక విశేష నామమన్నారు. మహర్షి దయానందులవారు కూడా ప్రాచీన ఋషుల మార్గాన్నే అనుసరిస్తూ 'కస్మై' అనే పదమునకు తమ వేద భాష్యంలో "సుఖస్వరూపాయ పరమేశ్వరాయ" అని అర్థం వ్రాశారు.

కొందరు విద్వాంసులు "వేదాలలో అక్కడక్కడ 'ఏ' అనే అక్షరం లోపిస్తూ ఉంటుంది. మనం అర్థం చెప్పుకునేటప్పుడు ఏ+కస్మై= ఏకస్మై = అట్టి ఏకేశ్వరునకే హవిస్సు నర్పించి నమస్కరిస్తున్నాను" అని అర్థం చెప్పుకోవాలంటారు. ఇక్కడ మనం 'కః' అంటే సుఖస్వరూపుడని అర్థం చేసుకుంటే సరిపోతుంది.

**26. <u>శచీవ ఇంద్ర పురుకృద్ ద్యుమత్తమ.............</u>** (ఋ. 1-53-3), (అథర్వ-20-3-21) : శచీవ = సర్వ శక్తి మంతుడు, పురుకృత్ = ఎక్కువ తక్కువలను చేయువాడు, ద్యుమత్తమ=అతిశయ దీప్తిమంతుడు. ఇవన్నీ ఏకేశ్వరుని శక్తులే. వేరువేరు దేవుళ్ళుకారు.

**27. <u>విపశ్చితుడు</u>** = జ్ఞానమయుడు (ఋ. 9-86-4).

**28. <u>శంభవుడు</u>** = సుఖ స్వరూపుడు.

**29. <u>మయోభవుడు</u>** = సర్వోత్తమ సుఖ ప్రదాత.

**30. <u>శంకరుడు</u>** = కల్యాణకరుడు.

**31. <u>మయస్కరుడు</u>**= తనభక్తులను కల్యాణకర కార్యాలలో నియుక్తంచేయువాడు.

**32. <u>శివుడు</u>** = మంగళ స్వరూపుడు.

**33. <u>శివతరాయుడు</u>**= మోక్షసుఖ ప్రదాత (యజు. 16-41).

పై 6 నామములు ఒకే ఈశ్వరునకు చెందినవి. యజుర్వేద 16వ.

అధ్యాయంలోను (నమకంలోను), అట్లే నాలుగు వేదాలలోను మరెన్నో పేర్లున్నాయి. వెదుక గలిగితే వేదేశ్వరునికి మనం సహస్రనామాలు తయారు చేయవచ్చు. ఇంతేగాక, ఋషులేమన్నారంటే - "అతని గుణ కర్మ స్వభావాలు అనంతం కనుక అతని నామములును అనంతములే" నన్నారు.

కవులు ఆ ఏకేశ్వరుని- "అనంత గుణగణ భూషిత ఓం, శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓం" అంటూ కీర్తించారు. మనంకూడా అట్లే కీర్తిద్దాము.

**34.** త్ర్యంబకుడు = భూ అంతరిక్ష ద్యులోకాలు మూడిటికిని మాత, ద్రష్ట, పాలకుడు (ఋ.7 - 59-12, యజు. 3-60).

**35.** పౌర్ణమాసీ = (పూర్ణమ్+ఆసీత్) విశాల విశ్వం అంతటానిండి యున్నవాడు (అథర్వ. 7-81. 1 నుండి 4 - పౌర్ణమాసీ సూక్తమంతా).

**36.** అమావాస్యుడు = అమా అంటే తోడుగా అని అర్థం. వాస్యుడంటే వసించేవాడు. సర్వవ్యాపక సర్వేశ్వరుడు మాత్రమే మనకు సదా తోడుగా ఉంటాడు. జననంలోను, మరణంలోను, జీవితంలోను చివరికి ముక్తిలోకూడా మనలో వ్యాపించి మనకు తోడుగా ఉంటాడు. (అథర్వ. 7-79-1 నుండి 4-అమావాస్యా సూక్తమంతా)

**37.** ఉచ్ఛిష్టుడు = సామాన్య సంస్కృత భాషలో ఉచ్ఛిష్టమంటే భోజనం చెయ్యగా మిగిలిన ఎంగిలి పదార్థమని అర్థం. కాని, వైదిక వ్యాకరణానుసారం "ఉత్ సర్వస్మాదూర్ధ్వం శిష్టాత్ పరమేశ్వరః" = విశ్వంలోని నక్షత్ర గ్రహగోళాదులన్నిటి పైనా విద్యమానమైయుండు పరమేశ్వరుడని అర్థం.

అథర్వవేదం 11కాం-7వ సూక్తమంతటికి (27 మంత్రాలకు) ఉచ్ఛిష్ట దేవత. అక్కడ ఉత్పత్తి ప్రలయాలనుండి మిగిలియుండు దేవుని చేతనే ఈ జగత్తంతా సృజింపబడినట్లు వర్ణించబడింది.

**38.** వైకుంఠుడు = (వికుణ్ఠాయాం మాయాయాం భువః) మూల ప్రకృతిని వికృతిగా-విశేషకృతిగా-రమణీయ సృష్టిగా చేసి విశ్వం అంతా వ్యాపించి ఉన్నవాడు అని అర్థం.

**39.** అంగిరుడు = ప్రాణప్రియుడు, **అంగిరసుడు** = అంగముల మధ్య రసరూపుడు (ఋ. 2-23-18) **అంగిరసతముడు**= అతిశయ రస స్వరూపుడు (ఋ. 1-100-4).

**40.** శవ సస్పతుడు = (బహువిధం శవో బలం విద్యతే యస్య తత్ సమ్బుద్ధౌ)

అందరికన్న, అన్నిటికన్న బలవంతుడు కనుక దేవునకు శవసస్పతుడని మరియొక పేరు (ఋ. 1-11-2).

41. **<u>ఈశానుడు</u>** = అన్నిటిని నియమించువాడు (ఋ. 1-9-5), (యజు. 25-1).
42. **<u>పురుష్టుతుడు</u>** = బహు విధముల స్తుతింపతగినవాడు (ఋ. 1-57-4).
43. **<u>మంహిష్ఠుడు</u>** = మహాదాత (ఋ. 1-57-1).
44. **<u>భూరిదుడు</u>** = అనంత గుణములు, అనంత ధనములు కలవాడు.
45. **<u>త్విషీమతుడు</u>** = మహాతేజస్వి (ఋ. 1-55-5).
46. **<u>ధృత వ్రతుడు</u>** = ధృఢమైన సృష్టిస్థితిలయ వ్రతధారి.
47. **<u>క్షోణీరివ ప్రతి హర్యుడు</u>** = పృథివివలె ఆకర్షించువాడు (ఋ. 1-57-4).
48. **<u>దర్శత శ్రీః</u>** = దర్శనీయ విభూతి గలవాడు (ఋ. 10-91-2).
49. **<u>యజిష్ఠుడు</u>** = పూజనీయుడు, సర్వోత్తమ సుఖ ప్రదాత (ఋ. 1-44-6).
50. **<u>మందిష్ఠుడు</u>** = అతిశయ ఆనంద ప్రదాత (ఋ. 1-51-11).

**ఓం అకామో ధీరో అమృతః స్వయంభూ రసేన తృప్తో న కుతశ్చనూనః ।**
**తమేవ విద్వాన్ న బిభాయ మృత్యో రాత్మానం ధీర మజరం యువానమ్ ॥**

– అథర్వవేదం (10-8-44)

పై వేదమంత్రంలోని అకాముడు, ధీరుడు, అమృతుడు, స్వయంభువుడు, రసతృప్తుడు, కుతశ్చనూనుడు (ఏరకమైన కొరతలు లేనివాడు) – ఈ 6 నామములు ఏకేశ్వరునివే. అట్లే –

**ఓం సపర్యగాత్+శుక్రమ్+అకాయమ్+అవ్రణమ్+అస్నావిరం**
**శుద్ధమ్+అపాపవిద్ధమ్। కవిర్ మనీషీ పరిభూః,**
**స్వయంభూః + యాథా తథ్యతోఽర్థాన్ వ్యదధాత్ +**
**శాశ్వతీభ్యః సమాభ్యః ॥** (యజు. 40-8)

పర్యగాతుడు (అంతటా వ్యాపించి ఉండువాడు), శుక్రుడు (అత్యంత శీఘ్రకారి) అకాయుడు (శరీర రహితుడు), అవ్రణుడు (వ్రణాలు లేనివాడు), అస్నావిరుడు (నాడీబంధనాలు లేనివాడు), శుద్ధుడు, అపాపవిద్ధుడు (పాపములచే, కర్మలచే అంటబడనివాడు), కవి (వేద కవి, సృష్టి కవి), మనీషీ (సర్వజీవుల మనస్సుల నెరుగువాడు), పరిభూతుడు (దుష్టుల నణచి పెట్టువాడు), స్వయంభువుడు

(మాతా పితలు లేకనే స్వయంగా సదా ఉండువాడు) - ఈ 11 నామములు కూడా ఏకేశ్వరునివే.

**1.** **అన్నపతి** (అన్నాన్ని - ఆహారాన్ని ఉత్పన్నల చేస్తున్నవాడు) (యజు. 11-83)

ఈ విధంగా వేదసంహితలను వెతుకుతూ వెడితే మదెన్నో దేవుని నామములు కనబడతాయి. గ్రంథవిస్తరణ భీతిచే ఈ అనుబంధము నింతటితో ముగిస్తున్నాము

**2.** **శవసస్పతి** = బలాధిపతి (ఋ. 1-11-2)

**3.** **సుద్రవిదిః** = సుందరమైన బలము, ధనము కలవాడు (ఋ. 1-94-15).

**4.** **సహస్వ** = బలతేజ శక్తి భండారము (ఋ. 7-4-4).

ఓ౩మ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

God is an embodiment of truth, intelligence and bliss, and one without form, all powerful, just, kind, unborn, infinite, unchangeable, beginningless, incomparable, support of all, all-pervading, ominiscient, undeteriorable, immortal, fearless, eternal, holy and Creater of the Universe, He alone is worthy of worship.

- Maharshi Dayanand Saraswathi

## పాఠకులమెదడుకు పదునుగా - కొన్ని ప్రశ్నలు

1. దేవుళ్ళు ఎంతమంది ? ఎవరిని దేవుడనాలి ?
2. దేవుని అసలు పేరేమి ? ఆ పేరుకు అర్థమేమి ?
3. దేవునికి ఎన్ని పేర్లున్నాయి? ఏ ఆధారంతో అన్ని పేర్లు కలిగాయి?
4. దేవుడు మనవలె జన్మిస్తాడా? లేక అవతరిస్తాడా?
5. ఏ దేవుణ్ణి స్తుతించాలి ? ప్రార్థించాలి ? ఉపాసించాలి ?
6. దేవుని స్తుతి ప్రార్థనోపాసనలు ఎందుకు చెయ్యాలి ? ఎలా చెయ్యాలి ?
7. దేవునికన్న అధిక శక్తిమంతులెవరు ?
8. దేవుని పేర్లలో కొన్ని ముఖ్యమైన వాటికి అర్థవివరణలు తెలుపండి?
9. దేవుని కొన్ని గౌణ నామములు (అంత ముఖ్యంకాని పేర్లు) తెలిపి వాటి అర్థాలను తెలుపండి ?
10. దేవుణ్ణి బ్రహ్మ విష్ణు మహేశ్వరులనీ, రాహు కేతువులనీ, నారాయణ గణపతులనీ ఎందుకంటారు?
11. దేవునికి కేవలం పుంలింగ నామములేకాక స్త్రీలింగ, నపుంసకలింగ నామములుకూడా ఉన్నాయా? అవి ఏవి ?
12. దేవుని గుణ కర్మ స్వభావాలు కొన్నితెలుపండి?
13. మనకు వచ్చే దుఃఖాలు ఎన్ని రకాలు? అవి ఏవేవి? సంక్షిప్తంగా వివరించండి?
14. మంగళాచరణం (గ్రంథప్రారంభం) ఎలా చేస్తే మంచిది ?
15. 'సత్యార్థప్రకాశం' అనే జగత్ప్రసిద్ధ గ్రంథాన్ని ఎవరు వ్రాశారు ?

శమ్ ఇతి ఓ౩మ్



## అష్టోత్తర శతనామావళి - శ్లోకాలతో ప్రార్థన

ఓ3మ్ ఖం విశ్వేశ్వరం ప్రాణం కుబేరం పురుషం తథా,
సవితారం చ పృథివీం స్వరాజం సర్వవ్యాపినమ్. 1
భగవంతం సర్వశక్తిమంతం శేషం పితామహం,
నిర్గుణం సగుణం మిత్రం సుపర్ణం శంకరం కవిమ్. 2
శం సత్యం చ మహాదేవం స్వప్రకాశ మురుక్రమం,
కాలాగ్నిం మాతరిశ్వానం భూమిం పరమపూరుషమ్ 3
విరాజం నిత్య మాప్తం చార్యమణం చ నిరంజనం,
ధాతారం విశ్వ స్రష్టారం పోషకం లయకారకమ్. 4
జ్ఞానానందమయం దేవం నిర్వికారం దయానిధిం,
న్యాయకారిణమాత్మానం విష్ణు మద్వైత మీశ్వరమ్. 5
శివం దివ్యం చ బ్రహ్మాణం చిత్రగుప్తం యమం ప్రియం,
అజం హిరణ్యగర్భం చానాదిం చ ప్రపితామహమ్. 6
పరమాత్మాన మన్నాదం రుద్ర మిద్రం వసుం జలం,
సూర్యం చంద్రం మంగళం చ రాహుం కేతుం శనైశ్చరమ్ 7
బుధం బృహస్పతిం బంధుం పితరం మాతరం తథా,
ఆచార్యం శక్తిం కూటస్థం నిరాకారం ప్రజాపతిమ్. 8
విశ్వంభరం శుద్ధబుద్ధం ముక్తం శుక్రం సరస్వతీం,
ధర్మరాజం మనుం లక్ష్మీం దేవీం చ పరమేశ్వరమ్. 9
ఆకాశం చ శ్రియం కాలం వరుణం చ గణాధిపం,
గురుం నారాయణం యజ్ఞం హోతారం ప్రాజ్ఞ మక్షరమ్. 10
ఆదిత్యం తైజసం వాయు మగ్నిం చాపి స్వయంభువం,
అవ్యయం ధ్యానమార్గేణగంతవ్యం నాన్యథా-లభమ్. 11
ఇంద్రియాణి సుసంయమ్య కృత్వా చ స్థిమితం మనః,
జన్మాది బంధమోక్షార్థం ధ్యాయే జ్ఞాన సమృద్ధయే॥ 12



## ఓ మానవా! దేవదేవుని గుణగణాలు కీర్తించు

ఓం అర్వాచీనం సు తే మన ఉత చక్షుః శతక్రతో।
ఇన్ద్ర కృణ్వంతు వాఘతః॥ (2)
నామాని  తే శతక్రతో విశ్వాభిః గీర్భిః ఈమహే।
ఇన్ద్ర అభిమాతిషా హ్యే ॥ (3)

- ఋగ్వేదం (3-37-2,3), అథర్వవేదం (20-19-2,3).

ఓ శతక్రతు - సర్వవ్యాపక సర్వేశ్వర! నీ దివ్యశక్తులు, క్రియలు వందలు, వేలు, లక్షలు. నీ భక్తులు నీ కరుణా కటాక్షాలకై నీ వేదాజ్ఞలను చక్కగా పాలిస్తారు. అనేకానేక నామములతో నిన్ను కీర్తిస్తూ జీవన సంగ్రామం చేస్తారు. తమలోని దురహంకార దురభిమానాలను పోగొట్టుకుని పరిశుద్ధులౌతారు. ప్రకృతిలో పరిపక్వమై సర్వ బంధన విముక్తులౌతారు. నీ ఆనందధామాన్ని చేరుకొని స్వేచ్ఛగా విహరిస్తారు. మేమును వారి మార్గమునే అనుసరింతుము గాక!

O Almighty God! You are endowed with hundred powers and operations. Let these devotees of yours make their spirit and eye upto date and upto standard.

O God Almighty! You are the performer of hundred acts. We in the worldly battle of encountering evils pronounce and think of your names and powers with all the hymns of praise.



# ఆర్య సమాజం -సీతాఫల్‌మండి కార్యక్రమాలు

1. యోగ వ్యాయామ తరగతులు :- ఉదయం 5.30 గం॥ నుండి 7 గం॥ల వరకు స్త్రీ పురుషులకు, మరియు సాయంకాలం 5.30 గం॥ల నుండి 7 గం॥ల వరకు స్త్రీలకు మాత్రమే నిర్వహించబడుచున్నవి.
2. దైనిక సంధ్య అగ్నిహోత్రాలు :- ప్రతి రోజు ఉదయం, సాయంత్రం జరుపబడుచున్నవి.
3. సత్సంగాలు :- సాప్తాహిక సత్సంగం-(ప్రతి ఆదివారము), మహిళా సత్సంగం ప్రీతి భోజనంతో పాటు ప్రతి నెల చివరి ఆదివారం. పర్వ సత్సంగాలు, పారివారిక సత్సంగాలు నిర్వహించబడుచున్నవి.
4. వైదిక విద్యాలయం హైస్కూల్ :- నర్సరీ నుండి పదవ తరగతి వరకు ఇంగ్లీష్ మాధ్యమంలో. ప్రభుత్వ పాఠ్యప్రణాలికతో బాటు ధార్మిక శిక్షణ కూడా బోధించబడుచున్నది.
5. సంస్కారాలు :- కోరినవారికి వైదిక సంస్కారాలు జరుపబడుచున్నవి.
6. హోమియో చికిత్సాలయం :- ధర్మార్థ హోమియో చికిత్సాలయం ద్వారా సాయంత్రము 5.30 గం॥ల నుండి 8.00 గం॥ల వరకు సేవలు అందించబడుచున్నవి.
7. విరాళాలు :- గురుకులాలకు, గోశాలలకు తగు రీతిగా ఆర్థిక సహాయాలు అందించబడుచున్నవి.
8. ఇతర సమాజాలకు :- బలహీన ఆర్యసమాజాలకు తగు రీతిగా సహాయం చేయబడుచున్నది.
9. విపత్సమయాలు :- విపత్సమయాలలో బాధితులకు సహాయాలు ఈయబడుచున్నవి.
10. ప్రచారం :- వేద ప్రచారం కొరకు మాసిక కరపత్రాలు మరియు వైదిక సాహిత్య ముద్రణ, ఉచిత వితరణ జరుపబడు చున్నవి.
11. ఉచిత వాచనాలయం ద్వారా ప్రతిరోజు సాయంత్రం 5.30 నుండి 8.30 వరకు బస్తీ పౌరులకు సేవలు అందించబడుచున్నవి.




ఆర్యసమాజము - సీతాఫలమండి భవనం

 **Price :** Read Fully and give to others

**DEVUDOKKADE - NAMAMULANEKAM...**



# దేవు డొక్కడే - నామము లనేకం

## (వేదప్రమాణం)

ఓం ఇంద్రం మిత్రం మరుణమగ్నిమాహు రథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్॥
ఏకం సద్ విప్రా బహుధావదన్తి + అగ్నిం యమం మాతరిశ్వానమ్ + ఆహుః॥

- ఋగ్వేదం (1-164-46), అథర్వవేదం(9-10-28)

సర్వవ్యాపక సర్వేశ్వరు డొక్కడే. అతనినే విప్రులు = (జ్ఞానులు) ఇంద్రుడని (జడ చేతన దేవతలన్నిటికి రాజని), మిత్రుడని (సర్వప్రాణులకు ఆప్తమిత్తుడని), వరుణుడని (అందరిచే వరింప తగినవాడని, శ్రేష్ఠుడని), అగ్నియనీ (గొప్ప జ్ఞానియనీ, ఉత్తమ నాయకుడని), దివ్యుడని (అన్నిటిని ప్రకాశింపచేయువాడని), గరుత్మంతుడని (గొప్ప ఆత్మయనీ) అంటారు. మరికొందరు ఆ ఏకేశ్వరునే అగ్నియనీ (స్వయం ప్రకాశకుడనీ) యముడనీ (అన్నిటిని నియమించువాడనీ), మాతీరిశ్వుడనీ (విశ్వమంతటికి ప్రాణమువంటివాడనీ) ఆహుః = పేర్కొంటారు.

(దేవుని గొప్పగొప్ప గుణాలు, శక్తులు, క్రియలు అనేకం. కనుక ఆయనకు అనేక నామములు కలిగినవి).

They call him Indra - God of supreme Power, Mitra - The friend of all, Varuna - The most Desirable being, Agni - The All - knowing, Divyathe - Shining one and Garutman - The mighty soul. The sages describe the one Being in various ways calling him Agni- Self refulgent one, Yama - The Ordainer of the world and Matharishwan - The Life energy of the universe.

Printed and distributed by :
**ARYA SAMAJ - SEETAFALMANDI**
Main Road, Seethaphalmandi,
Secunderabad - 500 061. (Telangana)
**Phone : 040-27071816 Cell : 9133134156, 9246174018**